97

నవంబర్ 1979



# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక



ఫోకస్:

స్త్రీల సమస్యలు, ఉద్యమాలు
చిన్నాలు సంస్మరణ

**EDITORIAL NOTE:** ఈ ప్రత్యేకానుబంధం కొంతమంది సృజన మిత్రుల సహకారంతో తయారుచేయబడింది. అందులో తోడ్పడిన ఢిల్లీ స్త్రీ సంఘర్ష్ సమితి సభ్యులకు, రచయిత్రి geit omdevt కు సృజన కృతజ్ఞతలు. Economic & Political Weekly కి (III and IV వ్యాసాలు) Feminist Net Work (V వ్యాసం) Sunday (VIII) పత్రికలకు కృతజ్ఞతలు.

---

శ్రీశ్రీ 70వ జన్మదినం సందర్భంగా జనవరి 1980 సృజన ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. నక్సల్బరీ, విరసం దశాబ్దంలో శ్రీశ్రీ పాత్రను వివరించే రచనలను ఆహ్వానిస్తున్నాం.

---

## పాఠకులకు విజ్ఞప్తి

## సృజన 100వ సంచిక ఫిబ్రవరి 1980

సృజన నూరవ సంచిక ప్రత్యేక సంచికగా తయారవుతున్నది. తొంభైతొమ్మిది సంచికలలోని ఎంచదగిన రచనలతో కూర్చే నూరవ సంచికలో పాఠకుల ఎన్నికతో కొన్ని రచనలు వుంచాలనుకుంటున్నాము. ఈసంచికలో మళ్ళీ ప్రచురించదగిన రచనలను సూచించవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాం. మా కూర్పులో మీసూచనలకు ప్రాముఖ్యం వుంటుంది. సృజన గతసంచికలో ప్రచురించబడిన, మీకు బాగా నచ్చిన, మళ్ళీ మళ్ళీ చదువుకోవాలనిపించే రచనలను సూచించవలసినదిగా కోరుతున్నాం.

సాహితీ మిత్రులు.

మీ సూచనలు మాకు డిసెంబర్ 1, 1979 వరకు చేరాలి.

సృజన నూరవసంచిక,

సృజన మాసపత్రికగా జన్మదినసంచిక,

ఫిబ్రవరి 1980 ప్రత్యేక సంచిక జనవరి 25వరకు వెలువడుతుంది.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక
97
నవంబర్ 1979

స్త్రీ విమోచనోద్యమ ప్రత్యేకం



SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

బూర్జువా ప్రజాస్వామ్యం, సోషలిస్టు ప్రజాస్వామ్యం :

## స్త్రీల పరిస్థితి

స్త్రీల ప్రతిపత్తి బూర్జువా ప్రజాస్వామ్యానికీ, సోషలిస్టు ప్రజాస్వామ్యానికీ మధ్యగల భేదాన్ని కన్నులకు కట్టినట్లు స్పష్టం చేస్తుంది.

బూర్జువా రిపబ్లిక్‌లో (అనగా భూమి, ఫ్యాక్టరీలు, షేర్లు వగైరాలమీద సొంత స్వామ్యం వున్నచోట), అది అత్యంత ప్రజాతంత్ర రిపబ్లిక్ అయినాసరే ప్రపంచంలో యెక్కడా, పురోగామి దేశాలలో యే దానిలోనూ స్త్రీల ప్రతిపత్తిలో సమానత్వం లేదు. ఫ్రెంచి (బూర్జువా ప్రజాతంత్ర) మహా విప్లవం జరిగి 125 యేండ్లు అయినప్పటికీ యిలా వుంది.

బూర్జువా ప్రజాస్వామ్యం మాటలలో సమానత్వమూ, స్వేచ్ఛా వాగ్దానం చేస్తుంది, కానీ ఆచరణలో ఒక్కగానొక్క బూర్జువా రిపబ్లిక్ కూడా, అత్యంత పురోగామి రిపబ్లిక్ కూడా, స్త్రీలకు (అంటే సగం మానవజాతికి), పురుషులకు చట్టం దృష్టిలో సంపూర్ణ సమానత్వం యివ్వలేదు, పురుషుని మీద ఆధారపడడం నుండి, పురుషుని పీడన నుండి స్త్రీలను విముక్తి చేయలేదు.

బూర్జువా ప్రజాస్వామ్యం స్వేచ్ఛా, సమానత్వాల గురించి ఆడంబర నుడికారాల, గంభీరమైన పదాల, పుష్కలమైన వాగ్దానాల, ఉదాత్తమైన నినాదాల ప్రజాస్వామ్యం. కానీ ఆచరణలో యిదంతా స్త్రీల స్వేచ్ఛా రాహిత్యానికీ, అసమానతకూ, దోపిడీ చేయబడే శ్రామిక ప్రజల స్వేచ్ఛా రాహిత్యానికీ, అసమానతకూ ముసుగు వేస్తుంది........

పీడితులకూ, పీడకులకూ, దోపిడీ చేయబడే వాళ్ళకూ, దోపిడీ చేసే వాళ్ళకూ "సమానత్వం" లేదు, ఉండజాలదు. పురుషుల చట్టబద్ధమైన అధిక సౌకర్యాల చేత స్త్రీలు లోకువగా ఉన్నంతకాలం, పెట్టుబడి పెత్తనం నుండి కార్మికునికి స్వేచ్ఛ లేనంతకాలం, పెట్టుబడిదారుని యొక్క, భూస్వామి యొక్క, వర్తకుని యొక్క పెత్తనం నుండి శ్రామిక రైతుకు స్వేచ్ఛ లేనంతకాలం, నిజమైన "స్వేచ్ఛ" లేదు, వుండజాలదు.

అసత్యవాదులూ, కపటులూ, మందబుద్ధులూ, గుడ్డివాళ్లూ, బూర్జువాలూ, వాళ్ళ మద్దతుదార్లూ దరహం మీద స్వేచ్ఛ గురించీ. దరహం మీద సమానత్వం గురించీ, దరహం మీద ప్రజాస్వామ్యం గురించీ మాట్లాడే మాటలతో ప్రజలను మోసగించడానికి ప్రయత్నించనీ;

మనం కార్మికులతోనూ, కర్షకులతోనూ యిలా చెప్తాం- యీ అసత్యవాదుల బురఖా చించివేయండి, యీ గుడ్డివాళ్ళ కళ్ళు తెరవండి. వాళ్ళను అడగండి:

- స్త్రీ పురుషుల సమానత్వం వుందా?

- ఏ జాతి ఏ జాతికి సమానంగా వుంది?

- ఏ వర్గం ఏ వర్గానికి సమానంగా వుంది?

- ఏ పెత్తనం నుండి, లేదా ఏ వర్గపు పెత్తనం నుండి స్వేచ్ఛ? ఏ వర్గానికి స్వేచ్ఛ? ............

ఒక పీడిత లింగం వుండగా, పీడక వర్గాలూ, పెట్టుబడి మీదా, షేర్ల మీదా సొంత స్వామ్యం వుండగా, క్రిక్కిరిసిన ధాన్యాగారాలు కలిగి, అన్నార్తులను బానిసలను చేయడానికి తమ మిగులు ధాన్యాన్ని ఉపయోగించేవాళ్లు వుండగా, అందరికీ స్వేచ్ఛా సమానత్వాల గురించి మాట్లాడే అసత్యవాదులు నశించాలి. అందరికీ స్వేచ్ఛకు బదులు, అందరికీ సమానత్వానికి బదులు, పీడకుల మీదా, దోపిడీదారుల మీదా పోరాటం జరుగుగాక. పీడించడానికీ, దోపిడీ చేయడానికీ గల అవకాశం రద్దు చేయబడుగాక. అది మన నినాదం!

పీడిత లింగానికి స్వేచ్ఛా, సమానత్వమూ!

కార్మికులకూ, శ్రామిక రైతులకూ స్వేచ్ఛా, సమానత్వమూ!

పీడకుల మీద పోరాటం, పెట్టుబడిదార్ల మీద పోరాటం, కులాక్ లాభార్జన పరుల మీద పోరాటం!

— లెనిన్

(1919)

---

భారతదేశాన్ని స్త్రీ పరిపాలిస్తున్నదని గర్వపడడానికేమున్నది- ఏ ఒక్కరోజయినా యీ దేశంలో మొగిలయ్యల ప్రాణాలకు, చెల్లీ చంద్రమ్మల మానాలకు భరోసావుంటేగదా. ప్రధానమంత్రిఅయికూడా స్త్రీగా, విధవగా మాటలుపడకతప్పని, అవమానాలు భరించకతప్పని ఇందిరా ప్రియదర్శినికే సాంఘిక విలువలేని యీ భూస్వామ్యవ్యవస్థలో- ఆమె ఏమయినా గర్వపడితే భూస్వాముల, పెట్టుబడిదారుల ఏజెంటు నయినందుకు గర్వపడవలసిందే తప్ప స్త్రీ అయినందుకు మాత్రం కాదు. ఆమె చేసిన, చేస్తున్న తప్పులకు ఆడదికావడమే కారణంగా చూపే వారెంతమందని!

('మల్లెపూలే విప్లవంలో మరతుపాకులు' చెల్లీ చంద్రమ్మ - ఒగ్గుకథ చివరి మాట నుంచి- ప్రచురణ: 1975)

# ఆత్మ విమర్శ

'స్వేచ్ఛ' కవితాసంకలనాన్ని సమీక్షిస్తూ కొజ్జా, రంకు వంటి మాటలు వేరే కవితల్లో వాడిన కవి స్త్రీ గురించి ఎంత సామ్యవాద దృక్పథంతో అదే సంకలనంలో కవిత రాసినా స్త్రీ గురించి కవి చిత్తశుద్ధితో, సీరియస్‌గా అలా ఫీలవుతున్నాడా అని అనుమానం కలగక మానదు అని 'ప్రజాసాహితి'లో రాసిన మాటలు విప్లవ దృక్పథం కలవారమని చెప్పుకుంటున్న వారందరూ ఆత్మవిమర్శ చేసుకోవాల్సిన అవసరాన్ని, అంతకన్నా తమపై తాము నిత్యమూ సాంస్కృతిక పోరాటాన్ని సాగించాల్సిన అవసరాన్నీ గుర్తుచేస్తున్నాయి.

విప్లవకారులు విప్లవ రచయితలు అందరూ ఆశయంవల్ల, నిర్మాణంవల్ల కమ్యూనిస్టులే కాని నిత్యజీవిత ఆచరణవల్ల, ఆ ఆచరణ నుంచి పొందే చైతన్యం స్థాయివల్ల కమ్యూనిస్టులు కాగలిగే అవకాశాలు ఈ వ్యవస్థలో తక్కువ. పైగా ఈ వ్యవస్థ ఫ్యూడల్ పురుషాధిక్య ఆలోచనా ప్రభావాన్ని, కమ్యూనిస్టుల కళ్ళల్లో కూడ చల్లుతూనే వుంటుంది. రోజూ కళ్ళు తుడుచుకున్నట్టు, ఇల్లు తుడుచుకున్నట్టు ఈ మనసును తుడుచుకుంటే తప్ప తనపై తాను పోరాటం చేయడమనేది వర్గపోరాటంలో భాగమని భావిస్తే తప్ప కమ్యూనిస్టు లేబులో, సర్టిఫికెటో, సభ్యత్వమో, గుర్తింపో ఒకరిని కమ్యూనిస్టుగా మార్చజాలదు. కమ్యూనిస్టు కాకుండా స్త్రీని అనుభవించడమో, ఆరాధించడమో తప్ప బానిసగానో, దేవతగానో చూడడం తప్ప మనిషిగా గుర్తించడం జరగదు. భోగవస్తువుగానో, పనిమనిషిగానో, తన పుణ్యలోకాల కొరకు పిల్లలనుగనే జంతువుగానో ఫ్యూడల్ పురుషుడు చూస్తే, లాభాలను ఆకర్షించే అంగడిబొమ్మగా పనులు, ప్రయోజనాలు సాధించే, పిల్లల్ని కూడ కనకుండా, అందం చెడకుండా తనకు సాంఘిక, ఆర్థిక అంతస్థులను పెంచే భాగస్వామిగా బూర్జువాపురుషుడు స్త్రీని చూసాడు.

ఈ నేపథ్యంలో, ఈ బురదలో వికసించిన విప్లవ దృక్పథానికి అంటిన బురదను కడుక్కుని అడుగేయాలి. మాచకమ్మ, రంకునేర్చి నమ్మ బొంక నేర్చింది, మొగణ్ణి కొట్టి మొరమొర, మేమేం గాజులు పెట్టుకొని కూర్చోలేదు, పౌరుషం-లాంటి మాటలు, మనకు తెలియకుండానే స్త్రీలను అవమానపరిచే మాటలు, మనకే మాత్రం ఆ దృష్టి, ఉద్దేశంలేకున్నా విప్లవ సాహిత్యంలో దొర్లుతూనేవున్నాయి. ఇందుకు కారణం మనం రాజకీయ ఆర్థిక వర్గపోరాటంలో భాగంగా సాంఘిక, సాంస్కృతిక పోరాటాలను, అంతకన్న ముఖ్యంగా, కమ్యూనిస్టు కాదల్చుకున్న మనిషి నూతన మానవుడుగా రూపొందే క్రమంలో తనపై తాను నిరంతరం కొనసాగించవలసిన పోరాటాన్ని, తీసుకోవలసినంత సీరియస్‌గా తీసుకోకపోవడమే.

స్త్రీ విమోచనోద్యమాన్ని విముక్తి ఉద్యమంలో భాగంగా ఆకాశంలో సగమైన ఆ సమస్యకు ప్రాధాన్యం తగ్గకుండా యిచ్చిన చైనా పోరాట చరిత్ర, శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవ చరిత్ర మన ఆత్మవిమర్శకు గీటురాయి.

— సంపాదకుడు

# "నేను సైతం భువన భవనపు బావుటానై పైకి లేస్తాను!"

మండే ఎండాకాలంలో ఒకరోజు. 'శ్రామిక సంఘటన్' కార్యాలయానికి ఇద్దరు మహిళలు వచ్చారు. వాళ్ళు పాల్గొన్న మద్యపాన వ్యతిరేక ఉద్యమంలో విజయం సాధించామని చెప్పారు. అజ్ఞాతవాసంలో వున్న కార్యకర్తలకు ఉత్తరాలు అందించ డానికి తాను, తన స్నేహితురాలు ఎమర్జన్సీలో ఒక వర్షం కురుస్తున్న రాత్రి పద్దెనిమిది గంటలపాటు ఎట్లా ప్రయాణించారో, ఎట్లా పోలీసుల కన్నుగప్పారో ఇంకో స్త్రీ వివరిం చింది. ఇంకో వృద్ధ స్త్రీ "జాతి పంచాయత్‌లలో స్త్రీలు ఉండాలి" అన్నది. చుట్టూ వున్న స్త్రీలు నిశ్శబ్దంగా నవ్వుకుంటూ ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు. "స్త్రీలకు అన్నీ కష్టాలే" అని కలిపిందామె. ఐనా వచ్చే జీవితంలో కూడా స్త్రీగానే బతకాలను కుంటున్నదామె. ఎందుకు? "స్త్రీలు పోరాడుతున్నారు గనుక........" వాళ్ళు వాళ్ళ సుఖప్రదమైన జీవితాన్ని గెల్చుకుంటారు గనుక.

ఈ మహిళ లెవరు? వీళ్ళు గిరిజనులు. ముఖ్యంగా భిల్ తెగల వాళ్ళు. ఈశాన్య మహారాష్ట్రలోని ధులియా జిల్లా షహదా, తలోదా, నందూర్బార్ తాలూకాలకు చెందినవాళ్ళు. ఈ జిల్లాకు సరిహద్దుగా ఒకవైపు గుజరాత్, ఇంకోవైపు మధ్యప్రదేశ్ వున్నాయి. ధులియా జిల్లా ఉత్తరాన సత్పుదా పర్వత శ్రేణులతో నిండివుంది. ఈ పర్వత పాదాలు ఒకప్పుడు దట్టమైన అడవుల్తో నిండివుండేవి. ఈ జిల్లాను సారవం తంగా మార్చిన విశాలమైన తాపీనది ఈ జిల్లాకు అడ్డంగా ప్రవహిస్తుంది.

1850 వరకు భిల్ ప్రజలు అడవుల ఉత్పాదనలమీదా వేటమీదా ఆధారపడి వాళ్ళ గిరిజన తెగల్లో ప్రశాంతంగా జీవిస్తుండేవారు. ఎక్కడో సుదూర ప్రాంతాల్లో జరిగిన ఘటనలు శతాబ్దాల తరబడి సాగుతున్న పద్ధతిని కల్లోల పర్చినయి; అమెరికా పౌరయుద్ధం మూలంగా ఇంగ్లండ్ పత్తి మిల్లులకు సరఫరా ఆగిపోయింది. భారతదేశం లోని బ్రిటిష్ పాలకులు తమ మిల్లులు నిరాటంకంగా సాగడం కోసం సారవంతమైన ధులియా మాగాణుల్లో పత్తి పండించ నిశ్చయించుకున్నారు. అట్లా గిరిజనేతర వ్యవ సాయదారులు, వ్యాపారులు, వడ్డీవ్యాపారులు ధులియాలోకి ప్రవేశించారు. 'ఆదివాసుల' భూములన్నిటినీ వాళ్ళు చట్టబద్ధంగానూ, చట్టవ్యతిరేకంగానూ ఆక్రమించుకున్నారు. పత్తి ఇప్పుడు ప్రధానమైన పంటగా లేనప్పటికీ ఇంకా ఆదివాసుల భూములను ఇతరులు

ఆక్రమించుకుంటూనే వున్నారు. ఇప్పుడు నూనె గింజలు, చెరకు మొదలైన వాణిజ్య పంటలు ఈ భూముల్లోకి ప్రవేశించాయి.

ధులియా జిల్లా జనాభాలో ఆదివాసులు 37% ఉన్నారు. భూమిలేనివాళ్ళ జనాభాలో వాళ్ళు 80% వున్నారు. ఇతర పేద వర్గాలు మహర్, కోలి, మాలి కులాలకు చెందిన వాళ్ళు. కుంభి, రాజపుత్ కులాల వాళ్ళు అధికారం చలాయిస్తున్న భూస్వాములు. కుంభి కులంలో రెండు వర్గాలున్నాయి. స్థానికులు సాధారణంగా మధ్యతరగతి రైతులు. 'గుజ్జర్'లు ధనిక రైతులు.

ఈ ప్రాంతానికి సుస్థిరమైన నీటిపారుదల సౌకర్యాలున్నాయి. ధనిక రైతుల, వ్యవసాయదారుల చొరవవల్ల- పెట్టుబడిదారీ పద్ధతుల స్థాయిలో- ఆధునిక వసరులన్నీ వేగవంతంగా ప్రవేశ పెట్టబడ్డాయి. 1950 నుంచి 1971 వరకు ఆయిల్ ఇంజన్‌లు 283 నుంచి 2,228 వరకు, ఎలెక్ట్రిక్ ఇంజన్‌లు 1 నుంచి 801 వరకు, ట్రాక్టర్లు 8 నుంచి 136 వరకు పెరిగినాయి. కాని భూకమతాలు ఎనభై ఎకరాల నుంచి వంద ఎకరాల వరకు మాత్రమే పెరిగాయి. ఆంధ్రలో వున్నటువంటి పెద్ద భూస్వామ్య కమతాలు ఇక్కడ కనపడవు. పైన చెప్పిన చారిత్రికాంశాలేగాక, బ్రిటిష్ పరిపాలనా కాలంలో ఈ ప్రాంతం రైత్వారీ పద్ధతికింద వుండడమే ఈ పరిస్థితికి కారణం. కొంతమేరకు 'పాళ్ళ'కిచ్చే పద్ధతి ఉన్నప్పటికీ ముఖ్యంగా యజమానే సాగుచేయడం కనబడుతుంది.

జనాభాలో వ్యవసాయ కూలీలు 48% ఉంటారు. వీళ్ళలో చాలామంది గిరిజనులు. ఆదివాసులు గాలీ వెల్తురూలేని చిన్న చీకటి గుడిసెల్లో నివసిస్తారు. వీళ్ళ ప్రధానాహారం ముతకరకపు గోధుమలు. ప్రతి ఇంట్లోనూ ఒక పెద్ద మట్టి జాడీ భూమిలో అమర్చబడి వుంటుంది. 'వంటగది' కొన్ని వంటపాత్రలు తప్ప పూర్తిగా ఖాళీగా వుంటుంది. వంటనూనెలేమీ వాడరు; మిరపకాయలు తప్ప వేరే సుగంధద్రవ్యాలేమీ ఉండవు, పళ్ళు కూరగాయలు కనబడవు. ఇది 'శ్వేతవిప్లవ' ప్రాంతమైనప్పటికీ, చాలా కుటుంబాలు ప్రభుత్వ ఋణాలపై కొన్ని పశువులను కొనుక్కొని ఉన్నప్పటికీ పాలను కుటుంబ అవసరాల కోసం వాడరు. ఇంకా, వర్షా కాలంలో నది నిండుగా పారుతున్నపుడు ఆదివాసులు చేపలు పట్టినప్పటికీ పాలలాగానే చేపలు కూడా బొంబాయి, కలకత్తాలాంటి మహానగరాలకి ఎగిరిపోతాయి. వీళ్ళు తినగలిగింది ఇలాంటి పుష్టిలేని ఆహారమైనప్పుడు ఈ గిరిజనుల్లో గజ్జి, టిబి వంటి వ్యాధులు విపరీతంగా ఉండడం ఆశ్చర్యమేమీకాదు.

ఈ ప్రాంతంలో భూస్వామ్య సంబంధాలు లేకపోయినా ఆ స్థానంలో కొన్ని అసాధారణ ఆర్థిక నిర్బంధాలు వ్యాపిస్తున్నాయి. ఉదాహరణకు మాల్‌దార్ (భూస్వామి) శ్రామికులకు అప్పులిచ్చి వాళ్ళతో సంబంధాల్ని ఏర్పరచుకుంటాడు. ఈ సంబంధం మొదటి మాల్‌దార్ ఇష్టంమీద ఇంకో మాల్‌దార్‌కు మార్చబడవచ్చు. అట్లాగే ఆ శ్రామికుడు మాల్‌దార్ భూమిలో గుడిసె వేసుకోవచ్చు కాని స్వంత భూమి లేదుగనుక ఏ క్షణంలోనైనా ఆ స్థలం వదిలిపెట్టవలసి వస్తుంది. ఇంకో యజమానిని చూసుకోవలసి వస్తుంది. చాలామంది యువకులు సంవత్సరపు కూలీ పద్ధతి (సాల్‌దారీ)ని వ్యతిరేకిస్తున్నారు. ఈ పద్ధతిని వాళ్ళు వెట్టిచాకిరీగా భావిస్తున్నారు. ఇంతే కాక వ్యవసాయ కార్మికులపై నిర్బంధం 'సస్యరక్షక సంఘం' లాంటి కొత్త ముసుగులు వేసుకుంటున్నది. ఈ 'సస్యరక్షక సంఘం' ముసుగు కింద చట్టవ్యతిరేక నిర్బంధాలు, బావుల్లో విషం కలపడం, గ్రామాలను తగులబెట్టడం, హింసలు, హత్యలు, స్త్రీలపై అత్యాచారాలు సాగుతున్నాయి.

సహజంగానే ఈ పరిస్థితులు సాంఘిక, ఆర్థిక ఉద్రిక్తతలకు కారణమయ్యాయి. కాని ఇతర గిరిజన ప్రాంతాల్లో వున్నట్టుగా ఇక్కడ సాయుధ తిరుగుబాటు సంప్రదాయ మేమీ లేదు. ఇక్కడి ప్రజలచే చాలా గౌరవింపబడిన అంబర్‌సింగ్ లాంటి స్థానిక నాయకులున్నారు. వీళ్ళు 1971 పాటిల్‌వాడి సంఘటనల తర్వాత వెలుగులోకి వచ్చారు. 1971లో పాటిల్ వాడిలో ధనిక రైతులు ఇద్దరు 'భిల్'లను కాల్చివేశారు. ఆ తర్వాతనే ఇక్కడ పేదలను సమీకరించడం ప్రారంభమైంది. పాటిల్‌వాడి హత్యలు ప్రజలను ఎంతో కదిలించాయి. చదువుకుంటూ పట్టణాల్లోవున్న యువకులు గ్రామాల్లోకివచ్చి ప్రజా సమీకరణకై కృషిచేశారు. దీని ఫలితంగా 1972లో 'శ్రామిక సంఘటన్' ఏర్పడింది.

'శ్రామిక సంఘటన్' చేపట్టిన ముఖ్య కార్యక్రమాలు 'ఆదివాసుల' భూములు తిరిగి యివ్వడం, మహారాష్ట్ర ఉద్యోగ భద్రతా పథకం అమలు, ఇకముందు గిరిజన భూములను గిరిజనేతరులు ఆక్రమించకుండా ప్రత్యేక చట్టం, కూలీరేట్ల పెరుగుదల.

వ్యవసాయకూలీల్లో మహిళలు 60 శాతం వుంటారు. కూలిరేట్ల పెరుగుదలకు జరిగిన పోరాటక్రమంలో వాళ్ళు చాలా పెద్దమొత్తంలో పాల్గొన్నారు. ఈ పోరాటంలో మహిళలు అంత పెద్దఎత్తున పాల్గొంటారని ఉద్యమనాయకులు కూడా ఊహించలేదు. మహిళలు ఉద్యమంలో భాగమైన సత్యాగ్రహంలో పాల్గోవడమే కాకుండా నిర్బంధించ బడిన సత్యాగ్రహులను తీసుకుపోతున్న పోలీసు వ్యానును ఆపివేశారు. వాళ్ళు నిర్బం

థాలనూ హింసలనూ అత్యాచారాలనూ చవిచూశారు; ఈ అనుభవాల తర్వాత మరింత సమరశీల కార్యకర్తలుగా మారారు.

స్త్రీలతో రోజు కూలీ పద్ధతిపై పనిచేయించుకుంటారు, పురుషుల కంటె తక్కువ కూలీ యిస్తారు. 'సంఘటన్' చేపట్టిన ఉద్యమం తమకు ప్రత్యక్ష సంబంధం ఉన్న దానిగా భావించిన స్త్రీలు దానిలో పాల్గోవడమేగాకుండా వాళ్ళ డిమాండ్ లెన్నో దానికి కలిపారు. అందువల్లనే యజమానులకూ, సంఘటన్ నాయకులకూ మధ్య ఒక ఒప్పందం కుదర్చడానికి చర్చలు జరుగుతున్నపుడు పూర్తిగా పురుషులతో మాత్రమే ఏ ఒప్పందమూ కుదరగూడదని వాళ్ళు నిరసన తెలిపారు. వాళ్ళు పొలాల్లో పని చేసారు, వాళ్ళు పోరాటంలో సంపూర్ణంగా పాల్గొన్నారు; వాళ్ళకు సంబంధించే ఏ నిర్ణయం చేయడానికైనా వాళ్ళు ఉండాలి. స్త్రీ పురుష కూలీరేట్లలో తేడాలున్నప్పటికీ స్త్రీ కూలీల సమస్యల గురించి తీసుకోవలసిన చర్యల విషయంలో ఈ నిరసన నాయకులను జాగ్రత్త పడేట్టుగా మార్చింది. ఇప్పుడు శ్రామిక సంఘాల్లో మహిళా ప్రతినిధులు కూడా వుంటున్నారు.

ఆ తర్వాత కొద్దిరోజులకే మహిళల కోసం ఒక మూడురోజుల 'శివిర్' (శిబిరం) ఏర్పాటు చేయబడింది. కార్యకర్తల మధ్య ఉత్సాహకరమైన చర్చలు సాగాయి. కొంతమంది 'వర్గం, దోపిడీ, కార్యాచరణ, విప్లవం' మొదలైనవి చర్చాంశాలుగా వుండాలని వాదించగా ఇంకొందరు స్త్రీల అణచివేత గురించిన చర్చాంశాలు వుండాలని అన్నారు. తర్వాత విడివిడిగా జరిగిన సమావేశాల్లో వర్గచైతన్యం గురించి చెప్పడానికి ప్రయత్నించిన చోట చాలా తక్కువ మంది పాల్గొన్నారు. ఈ కార్యకర్తలు 'పేద రైతుల' గురించి 'భూమిలేని వ్యవసాయ కూలీల' గురించి చెప్పి ఒక్కొక్క స్త్రీని తన వర్గమేమిటో గుర్తించుకోవలసిందిగా కోరారు. ఐతే స్త్రీల పనులు, వాళ్ళ జీతాలు, పోరాటాలు, భర్తల గురించిన సమస్యలు, కన్యాశుల్క సంప్రదాయం మొదలైన అంశాలు చర్చించిన చోట చాలామంది స్త్రీలు పాల్గొన్నారు. ఆర్థిక, కుటుంబ కలతలకు కారణమైన, స్త్రీలకు ముఖ్యంగా సంబంధమున్న మద్యపాన సమస్య కూడా చర్చకు వచ్చింది. 'సంఘటన్' చేపట్టిన మద్యపాన వ్యతిరేక ఉద్యమం ఈ చర్చల, తర్వాత జరిగిన చర్చల వల్ల ప్రారంభమైందే.

ఇట్లా వేరువేరు ప్రాంతాల్లో నెల కొకసారి శిబిరాలు నిర్వహించబడేవి. వారం రోజులు జరిగే ఈ క్యాంపులకు ఇరవైనుంచి ఇరవైఐదు మంది మహిళలు, బాలికలు హాజరయ్యేవారు. ఉదయం తరగతులు చదువుచెప్పడానికి ఉపయోగించబడేవి;

పుస్తకాలేమీ వాడబడేవికాదు. వాళ్ళ జీవితానికి, వాళ్ళ పోరాటానికి సంబంధించిన పదాల నేర్పరిచే అక్షరాలు కొన్నింటిని వాళ్ళకు మౌఖిక, దృశ్య పద్ధతుల ద్వారా బోధించేవారు. శిబిరాల నుంచి తిరిగి వచ్చిన తర్వాత గ్రామంలో వున్న చదువు కున్న వారి సాయంతో ఆ అక్షరాలు బాగా నేర్చుకునేట్టుగా వాళ్ళను తయారు చేసేవారు. మధ్యాహ్నం తరగతులు చర్చకు నిర్దేశింపబడేవి. ఈ చర్చలలో మాల్‌దార్‌లకు కూలీలకు మధ్యవున్న సంబంధాలు, ప్రస్తుత ఆర్థిక పరిస్థితి వంటి అంశాలేగాక "ఇంటి దగ్గర నీ పని పరిస్థితులేమిటి?" "నీ పని స్థలం దగ్గర పరిస్థితులేమిటి?" "నీ బిడ్డ గురించి నువ్వేం చేస్తావు?" లాంటి ప్రశ్నలు కూడా వుండేవి.

పాటలు, నాటకాలు- కొన్ని ప్రత్యేకంగా స్త్రీలకు సంబంధించినవి- ఉద్యమంలో భాగంగా బాగా ప్రచారమైనాయి. ఒక నాటకంలో ఒక స్త్రీ తన కాబోయే భర్త తాగుబోతైనందువల్ల, కాబోయే మామ 'సంఘటన్' సమావేశాలకు పోవద్దని చెప్పినందు ఆ యువకుణ్ని పెళ్ళి చేసుకోడానికి నిరాకరిస్తుంది. తన కొడుకుకు కాబోయే భార్యగా కన్యాశుల్కమిచ్చి ఆమెని కొన్నానని కనుక తనపట్ల ఆమె పూర్తి విధేయతతో వుండాలని అంటాడు ఆ యువకుని తండ్రి- కానీ ఆ యువతి తన నిర్ణయానికి కట్టుబడివుంది 'సంఘటన్'లోని ఒక క్రియాశీల కార్యకర్తను పెళ్ళి చేసుకుంటుంది.

స్త్రీలు శిబిరాల్లో ఉన్నపుడు ఇల్లు ఎవరు చూసుకుంటారు? సాధారణంగా ఇతర మహిళలు. కొన్నిసార్లు భర్తలు కూడా ఇంటిని చూసుకుంటున్నారు. ఒక సందర్భంలో ఇద్దరు మహిళలు శిబిరం ఐపోయింతర్వాత ఇంటకి రాకుండా ఇంకో గ్రామానికి పోయారు. దీనివల్ల తమ భర్తలు ఇంటినీ పిల్లలనూ సంరక్షించడమంటే ఏమిటో బాగా తెలుసుకుంటారని వాళ్ళన్నారు. సాధారణంగా పురుషులందరూ సంఘటన్ సభ్యులుగావడంవల్ల ఈ విషయంలో చాలా సహకరిస్తున్నారు.

మాల్‌దార్‌లతో, పంటల రక్షకాధికారులతో ఉత్పత్తి సంబంధాలవల్ల మహిళలు లైంగిక అత్యాచారాలకు గురయ్యారు. సంఘటన్ ఏర్పడి చురుకుగా పనిచేయడం ప్రారంభించిన తర్వాత మహిళలు తాము ధనికుల, వాళ్ళ తొత్తుల దయపై ఆధారపడి లేమని గ్రహించారు. స్త్రీలు వాళ్ళ కులాల వాళ్ళ చేతుల్లోనే అవమానాలపాలు గావడం అక్కడక్కడ జరుగుతుంది; ఇవి 'జాతి పంచాయత్'లలో పరిష్కరింపబడతాయి. ఈ మధ్యే ఒక స్త్రీని అవమానపరచ ప్రయత్నించిన ఒకనికి జాతి పంచాయత్ కొంత జుర్మానా విధించింది (ఈ జుర్మానాతో తాగడమూ, విందు చేసు

కోవడమూ సాగిస్తారు పంచాయితీ పెద్దలు). ఎలాంటి శారీరక శిక్ష విధించగూడదని పంచాయితీ ఆదేశించింది : నేరస్తుడు ఫిర్యాదీ స్త్రీ పాదాలు తాకి క్షమాపణకోరాలని తీర్పు చెప్పింది. ఆ స్త్రీ పంచాయితీ ఆదేశాన్ని లక్ష్యపెట్టకుండా ఆ నేరస్తుణ్ని చెప్పుతో కొట్టింది. ఆమె ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఆ ఆదేశానికి అనంగీకారాన్ని పనిలో చూపించింది. "స్త్రీలు జాతి పంచాయత్‌లో వుండాలి" అని ఇవాళ ఒంటరి మహిళ అంటున్నది గాని ఒకనాటికి చాలామంది చాలా బలంగా ఈ కోర్కెను తెలుపుతారు.

స్త్రీలు తమను సంఘటన్‌తో భాగంగాభావించి ఉన్నారు, సంఘటన్ కార్యక్రమాల్లో చాలా శ్రద్ధగా పాల్గొంటున్నారు. నిజంగానే వాళ్ళకు చాలా సమస్యలున్నాయి. గిరిజనుల ప్రపంచమే ఇరుకైనది- ఇక గిరిజన స్త్రీల ప్రపంచం ఇంకా ఇరుకైనది- వాళ్ళలో చాలామంది నిరక్షరాస్యులు; విపరీతంగా విస్తరిస్తున్న బొంబాయి మహానగరం వాళ్ళకు ఇరవైనాలుగు గంటల ప్రయాణ దూరంలోనే ఉన్నప్పటికీ వాళ్ళలో చాలా మంది నగరాలను చూడనేలేదు. నాయకత్వంలో వున్న చురుకైన కారకకర్తలకు ప్రవర్తనకు చైతన్యానికి, సంబంధించిన సమస్యలున్నాయి. నిజానికి 'స్త్రీముక్తి' వర్గపోరాటంలోని విడదీయరాని భాగమేనని చాలామంది భావిస్తున్నప్పకీ ఆ చరణలో పాత పద్ధతులే కొనసాగుతున్నాయి. ఇంటిపని ప్రాథమికంగా ఇంకా మహిళలదిగానే వున్నది, కనుక పురుషులు రాజకీయ, ప్రజాస్థాయిల్లో నాయకత్వంలో ప్రబల స్థానాల్లో వున్నారు. కొన్నిసార్లు చేపట్టిన కార్యక్రమాలు గిరిజన మహిళలకు ప్రత్యక్ష సంబంధాన్ని కలిగి వుండడం లేదు. ఇలాంటి వాటిలో ఒకటి సినిమాల్లో నగ్న ప్రదర్శనకు నిరసన. ఇటువంటి కార్యక్రమాలు అర్థం లేనివిగా మారిపోతాయి ముఖ్యంగా గిరిజన స్త్రీలముందు.

ధులియా మహిళా ఉద్యమం భూమిలేని పేదల, వ్యవసాయ కూలీల పోరాటంలో పుట్టింది. దానితో ప్రాణప్రదమైన లంకె కలిగి వుంది. ఈ వుద్యమం పుట్టుకా, సాధించిన విజయాలూ, ఎదుర్కొన్న, ఎదుర్కొంటున్న సమస్యలూ స్త్రీవిముక్తి వర్గ పోరాటంతో సంబంధం కలిగివున్నదని భావించే వారందరికీ ఆసక్తికరమైనవి, తెలుసుకోదగ్గవి.

---

జీవిత చిత్రాలు : 1

# పొగచూరిన బతుకులు

మహారాష్ట్ర సరిహద్దుకు ఒక మైలు యివతల కర్ణాటక రాష్ట్రంలో నిపాని ఓ ఊరు. ఇక్కడ పొగాకు బాగా పండుతుంది. మురుగు, కంపుతో నిండిన సందులు (వీధులు) ఎప్పుడు కూలుతాయో అనిపించే యిరుకు యిళ్ళు. ఈ యిళ్ళలో– నూనె దీపాల మాట దేవుడెరుగు.. వెలుగు చొరబడలేదు; చీకటి గుయ్యారాలు. మరుగుదొడ్లు లేవు. బోళ్ళు కడుక్కున్నా, స్నానం చేసినా, మురికినీళ్ళు బయటికి పోయేఏర్పాటు లేదు. ఈ యిళ్ళల్లో బీడీ కార్మికులు వుంటారు. వీళ్ళు దేశం నాలుగు మూలల నుంచీ వచ్చినవాళ్ళు, రకరకాల మతాల వాళ్ళు. అయితే ఎక్కువ మంది తెలుగు దేశం నుంచి వచ్చిన తురకలు.

వీళ్ళు పొద్దున నాలుగింటికి నిద్రలేస్తారు. మగవాళ్ళు బీడీలు చేసే పనిలో మునిగిపోతారు. ఎన్ని పనులు చూసుకుంటే బీడీలు తయారు కావాలె! ఆడవాళ్ళు పాచి పని, వంటపని జూసుకొని మగవాళ్ళకు పనిలో తోడువస్తారు. పిల్లలూ ఆదోపని, యిదోపని సాయంవస్తారు. రాత్రి పొద్దు పోయేదాకా పని సాగుతూనే వుంటుంది. గుడ్డి దీపం వెలుక్కు బీడీలు చుడుతూ కనిపిస్తారు. బీడీల పనికి ఏకాగ్రత అవసరం. వొంటికి దాదాపు కదలికవుండదు. చేతులు పనిచేస్తూవుంటాయి. ఏళ్ళు గడిచినా కొద్దీ ఆడ, మగ తేడా లేకుండా అందరికీ కంటి చూపు తగ్గుతుంది, వళ్ళు వంగి పోతుంది, పొగాకు వాసనవల్లా నూనె దీపం పొగవల్లా, క్షయ (దగ్గు, దమ్ము) రోగానికి గురవుతారు. ఇంకెన్నో జబ్బులు వీళ్ళను పట్టుకుంటాయి. బీడీల పనంతా వీళ్ళు తమ యిళ్ళల్లోనే చేస్తున్నారు, ఫ్యాక్టరీలో చేయడం లేదు, కాబట్టి రోగమొచ్చినా నొప్పొచ్చినా సెలవు దొరకదు. పని మానేస్తే పస్తులే. యజమాని మందు ఖర్చులు యివ్వడు.

కిందా మీదాపడి ఒక కుటుంబం రోజుకి వేయి బీడీలు చేయగలుగుతుంది. దీనికి కూలీ నాలుగున్నర. సర్కారు (ప్రభుత్వం) నిర్ణయించిన కూలీ అయిదు రూపాయల యిరవై పైసలు. కాని ఎవరూ యీ లెక్కన యివ్వరు. నిజానికి, ఆ చుట్టుపక్కల కొన్ని ప్రాంతాల్లో మూడు రూపాయల యిరవై పైసలే యిస్తారు. కొన్ని బీడీలు సరిగా లేవని, యీ కూలీడబ్బుల్లో సైతం కోతపెడతారు. వయసు పెరుగుతున్నా కొద్దీ సరిగా కుదరని బీడీల సంఖ్య ఎక్కువ అవుతుంది. దీని ఫలితంగా పని దొరకదు. ఈ స్థితిలో ఎందరో పనివాళ్ళు ఊరు వదిలి చుట్టుపక్కల ఊళ్ళలో బిచ్చమెత్తుకుని బతుకుతారు. యిన్నాళ్ళూ కాయకష్టం చేసుకొని బతికిన ఊళ్ళోనే బిచ్చమెత్తాలంటే వాళ్ళకు అవమానంగా వుంటుంది.

ఇతర కూలీస్త్రీలకంటే బీడీలు తయారుచేసేవారే నయం. ఆ ఊళ్ళో పొగాకు దంచే పనిలో పదహారు, పదిహేడువేల మంది ఆడవాళ్లు వున్నారు. ఊళ్ళో వున్న పొగాకు గోదాములకు రోజూ అయిదారు మైళ్లు నడిచిపోవాలె. అంతా చుట్టు పక్కల పల్లెల వాళ్లు. పొద్దున సరిగ్గా ఎనిమిదికల్లా గోదాముల దగ్గర వుండాలె. ఆ సమయంలో గోదాంగేటుకి నాలుగు అడుగుల దాపుకి వచ్చిన వాళ్ళని కూడా లోపలికి రానివ్వరు. మునీమ్ బూతులు తిడతాడు. తలుపులు మూసుకుంటాయి. కాళ్ళీడ్చుకుంటూ వెనక్కి తిరిగిపోవలసిందే. ఇంకా ఎంత పొద్దున లేవాలి, పాపం, వాళ్లు! ఇప్పుడింట్ఫ్రి, బోళ్లు తోముకుని వంటచేసుకుని నిపానీ వైపు పరుగుతీస్తారు. వండుకున్నది తినే టైం వుండదు వాళ్ళకు. చేసుకున్న జొన్నరొట్టెలు నములుతూ పరుగెత్తుతారు. ఇంత చేసినా ఒక్కొక్కసారి ఆలస్యమైపోతుంది, పని దొరకదు. పగలు అరగంట తీరిక దొరుకుతుంది. ఈ కొద్ది సమయంలో తెచ్చుకున్నది తినాలె, చిన్న పిల్లలకు తినిపించాలె. గోదాం గేటు బయట యీ చిన్నపిల్లలను పెద్దపిల్లలు ఆడిస్తుంటారు.

చాలా గోదాములు పాతవి, తాతలనాటివి. వాటిల్లో వెలుగు అసలే వుండదు. కిటికీలుండవు. పొగాకుపొడి, ఆకుల వాసనతో, లోపల గాలి ఘాటెక్కి మలినమైపోయివుంటుంది. కొత్తవాళ్ళు ఎవరైనా ఆ చోటుకు వస్తే తుమ్ములతో, గబ్బు వాసనతో చచ్చిపోతారు. ఒక్కొక్క గదిలో, గది పొడుగునా పొగాకు కుప్పలు కుప్పలుగా పడివుంటుంది. దీనికి అటొక వరుసా యిటొక వరుసా ఆడ కూలీలు కూచుని వుంటారు. పెద్ద పెద్ద కర్రలతో లయబద్ధంగా పొగాకును దంచుతూ వుంటారు. గంటలు గంటలు- కాలం గడుస్తూ వుంటుంది. పని సాగుతూనే వుంటుంది. చినిగిన చీరె కొంగులతో ముఖం కప్పుకోడానికి ఎంత ప్రయత్నించినా పొగాకు ధూళి వాళ్ళ వంటి మీద పడి, ముక్కుల్లో, నోళ్ళలో దూరుతూనే వుంటుంది. ఊపిరితిత్తులు దెబ్బ తింటాయి. పురుగులను చంపే మందు చల్లిన పొగాకును దంచవలసి వచ్చినపుడు యింకా ప్రమాదం. తరుచూ జ్వరం అంటుకుంటుంది. యజమాని పనిలోంచి తీసేస్తాడు. వచ్చే ఆ కొద్దిపాటి సంపాదనా పోతుంది. పొగాకు బేళ్ళను మోసుకుపోవలసిన పని కూడా వాళ్ళదే. సాధారణంగా ఈ పని మగవాళ్ళతో చేయిస్తారు. ఆడవాళ్ళకైతే తక్కువ కూలీ యివ్వవచ్చు కదా- అని కొందరు యజమానులు ఆడవాళ్ళకే యీ పని అప్పగిస్తారు.

ఇళ్ళలో బీడీలు తయారుచేసే ఆడవాళ్ళ కంటే గోదాముల్లో పనిచేసే స్త్రీలు వంచనకీ లైంగిక దోపిడీకి కూడా ఎక్కువగా గురి అవుతున్నారు. తయారుచేసిన

బీడీలను యివ్వడానికి మగవాళ్లు వస్తే బాగాలేవని చాలా బీడీలను తిరస్కరిస్తారు. కాబట్టి బీడీలు యివ్వటానికి ఆడవాళ్ళు రావలసివస్తుంది. బీడీలు తనిఖీ చేసేవాళ్ళ కోరికలూ, యజమానుల కోరికలూ తీర్చకపోతే, సరిగాలేవని చాలాబీడీలు తీసివేస్తారు, కూలి తగ్గుతుంది. అందుకని ఆడవాళ్ళు వాళ్ళకు లొంగిపోవలసి వస్తుంది. అయితే వీళ్ళు రోజుకి ఒకసారి మాత్రమే గోదాముకు రావాలె. కాని గోదాంలో పనిచేసే కూలీలు జైల్లో గడిపినట్టు దినమంతా అక్కడే గడపాలె. రాత్రి కూడా- ఆడకూలీల చేత రాత్రివేళ పని చేయించకూడదని చట్టం వున్నా, అక్కడ ఆడకూలీలు రాత్రి షిఫ్టులో కూడా పని చేయవలసిందే. వంటి సత్తువంతా పోయేదాకా పనిచేసి యింటికి తిరిగి వస్తారు. అయితే కాసేపు యింటి దగ్గర హాయిగా వుండే దెక్కడ ? వంటపని చూసుకోవాలె. యింట్లో అందరి అవసరాలూ చూడాలె. కొద్ది సేపు నిద్రపోయి లేచి తిరిగి నిపానికి పరిగెత్తాలి-

వేల మంది కార్మికులు ఉన్నప్పటికీ, బీడీ పరిశ్రమను కుటీర పరిశ్రమగానే చూస్తున్నారు. ఈ పరిశ్రమ ఫ్యాక్టరీ చట్టం కిందికి రాదు. ఇది బీడీ పరిశ్రమ యజమానులు కావాలని చేస్తున్న కుట్ర- 1952కు ముందు షెడ్స్ (రేకు గదుల) కింద కూలీలు బీడీలు చేసేవారు. అప్పుడు రోజుకు యిన్ని గంటలు మాత్రమే పనిచేయాలని వుండేది. సెలవులు కూడా వుండేవి. 1952లో రెండు నెలలు సమ్మె జరిగింది. సమ్మె జయప్రదం కాలేదు. యజమానులు పని పద్ధతి మార్చారు. షెడ్స్ మూసేసారు. పొగాకు యింటికి యిచ్చి ఇళ్ళలోనే బీడీలు చుట్టుకురమ్మనే యిప్పటి పద్ధతి అమలులోకి తెచ్చారు. మహారాష్ట్రలోని కొల్హాపూర్, జయ్‌సింగ్‌పూర్, మిరాజ్ ఊళ్ళలో వున్న బీడీ పరిశ్రమలను వాటి యజమానులు కర్ణాటకలోని నిపానీకే మార్చారు. ఎందుకంటే- మహారాష్ట్రలోని చట్టాలు బీడీ కార్మికులకు కొద్దో గొప్పో లాభం కలుగచేసేవిగా వున్నాయి. నిపానీకి వచ్చి కార్మికులకు తక్కువ కూలీ యిచ్చి యజమానులు ఎక్కువ లాభాలు చేసుకుంటున్నారు. కార్మిక సంఘాలు దాదాపు లేనట్టే. కార్మికులను కూడగట్టి సంఘం పెట్టే ప్రయత్నాలను క్రూరంగా అణచి వేస్తున్నారు-

ఇక్కడ రోజూ ఎనిమిది లక్షల బీడీలు తయారౌతాయి. వీటిని దేశం నలు మూలలకీ పంపి అమ్ముతారు. లక్షల రూపాయల లాభాలు గడిస్తారు. బీడీ పరిశ్రమ యజమానులు ఖరీదైన విదేశీకార్లలో తిరుగుతారు, తాగుతారు, ఉంపుడు కత్తెలతో జల్సాగా విహరిస్తారు. విలాస వస్తువుల కోసం విదేశాలు పోతారు. రాజ భవనాల్లాంటి యిళ్ళలో దర్జాగా కాలం గడుపుతారు. ఈ యజమానులూ,

ఇంకా యిక్కడి వ్యాపారులూ కార్మికులను బహుముఖంగా- అంటే- ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవితాన్నే- కాక, కార్మికుల వ్యక్తిగత జీవితాన్ని కూడా అదుపులో పెడుతున్నారు. బీడీ పరిశ్రమకు చెందిన యజమానీ, వ్యాపారి నుంచి మొదలై పొగాకు పండించే భూస్వామి దాకా యీ దోపిడీ కొనసాగిస్తున్నారు- భూస్వామి స్వయంగా పండించడు. తన భూమిలో కష్టపడి పంటతీసిన రైతును దోచుకుంటాడు. బీడీలు చేసే పనివాడూ అతని కుటుంబమూ దోపిడీకి గురి అవడం సరే సరి. మగకూలీ అయితే ప్రధానంగా ఆర్థికంగా మాత్రమే దోపిడీ చేయ బడుతున్నాడు. రావలసిన కూలీ కంటే ఎంతో తక్కువ ముడుతున్నది- పొందవలసిన యితర సౌకర్యాలు లేనేలేవు. ఆడకూలీ లైంగికంగా కూడా దోపిడీకి గురి అవుతున్నది. యజమానులకూ, పని చేయించే మేస్త్రీలకూ, అప్పుడప్పుడు తమ శరీరాలు అప్పగించకపోతే తిండికి చావాల్సిందే. వాళ్ళతో పాటు వాళ్ళ కుటుంబాలూ ఎండవలసిందే.

ఈ బీడీ కార్మికులు యివాళ ఎంతో భయంగా బతుకుతున్నారు- సంఘం పెట్టుకో ప్రయత్నిస్తే యజమాని ఆగ్రహించి ఎక్కడ పనుల్లోంచి పీకేస్తాడో, ఎక్కడ బతుకుతెరువు లేకుండా పోతుందో- అని సంఘం సంగతే ఆలోచించరు. శ్వాస ఆడని ఈ యిరుకైన మురికి యిళ్ళ చీకట్లలోకి చీకటి గుయ్యారపు పొడుగైన గోదాముల్లోకి, ఆశాకిరణాలు దూసుకుపోయేదెన్నడో ?

(అనిల్ అవచత్ వ్యాసం ఆధారం : EPW)

జీవిత చిత్రాలు : 2

## నెత్తిమీద ఇటుకలతో.... ఆమె

కేరళ రాష్ట్రంలోని తిరువనంతపురంలో అంటరాని కులానికి చెందిన నడివయసు ఆడ కూలీ జయమ్మ. (అంటరానితనం నేరమనీ, రాజ్యాంగ విరుద్ధమనీ, యింకేదో అనీ, పెద్దపెద్ద మాటలు బస్సులమీద సైతం రాస్తున్న ఈ రోజుల్లో కూడా ఆమెను అంటరాని కులం మనిషిగానే చూస్తారు.) రాష్ట్రంలో అన్నింటికంటె పెద్ద కుటీర పరిశ్రమ అయిన యిటుకల తయారీ పరిశ్రమలో పనిచేసే ఒక లక్ష యిరవై వేల మంది పనివాళ్ళలో జయమ్మ ఒకరు. తడవకు యిరవై యిటుకలు నెత్తిమీద తట్టలో పెట్టుకొని, రోజు ఆరేడు వందల యిటుకలు మోస్తూ, ఆమె గడిచిన ముప్పయి సంవత్స

రాల నుంచీ ఈ పనిలోనే వున్నది. రోజుకు అయిదు రూపాయలకంటె ఎక్కువ కూలీ ఎన్నడూ ముట్టలేదు. ఇన్నేళ్ళు గడిచినా యజమానులు ఆమెను ఈ పనిలోంచి మార్చి యింకో పని యివ్వలేదు, కూలీ పెంచలేదు. ఎందుకంటే ఆడకూలీలు మట్టి ముద్దలు, యిటుకలు మోయడానికి మాత్రమే తగినవారని, నేర్పుతో చేయవలసిన పను లన్నీ మగ కూలీలే చేయగలరనీ, మగ కూలీలకే ఈ పనులుచేసే అధికారంవున్నదనీ అనుకుంటారు. మట్టి పిసికీ, యిటుక చేసి, చేసిన యిటుకల్ని ఆవంలో పేర్చి, మగ కూలీలు రోజుకి పది నుండి పన్నెండు రూపాయలదాకా సంపాదిస్తారు. తన కొడుకుల్లో ఇద్దరికి రోజుకు పది ఆదాయంవుండే ఈ పనులు దొరకడం జయమ్మకు నయమైంది. కాని ఆమెకూ, ఆమె కూతుళ్ళకూ నాలుగున్నర లేక అయిదు రూపాయలు మాత్రమే- అదయినా పని దొరికిననాడు.

అత్త యిటుకలు మోసే రోజుల్లో ఆమెకు సాయంగా జయమ్మ పనిలో కుదురు కున్నది. అపుడు ఆమె వయసు తొమ్మిదో పదో! ఆమె తండ్రి ఓ పెద్ద భూస్వామి కింద భూమిలేని నిరుపేద రైతుకూలీ. తల్లి కూరగాయలు అమ్ముకొని నాలుగు రాళ్ళు సంపాయించేది. పదహారో ఏట కన్నన్‌తో జయమ్మకు పెళ్ళయింది. కన్నన్ పడవ నడిపేవాడు. ఎరువ కులం. కేరళ జనాభాలో నూటికి యిరవైరెండు మంది ఈ కులం వాళ్ళే. ఈ కులం వాళ్ళను కులహీనుల్లో మొదటి తరగతికి చెందిన వాళ్ళుగా చూస్తారు. కొబ్బరిపీచును ఒక చోటినుండి మరోచోటికి మోసుకుపోవడం, తాళ్ళు పేనడంతో సహా, కొబ్బరితోటలకు సంబంధించిన పనులన్నీ చేయడం వాళ్ళ కులవృత్తి.

కన్నన్‌కు స్వంత పడవ అంటూ ఎన్నడూ లేదు. ఏళ్ళుగా పచలూరు, ఆకులం వూళ్ళ మధ్య పడవ నడుపుతున్నాడు. కొబ్బరిపీచు చేరవేయడం అతని పని. తరచుగా పడవలో యింకో యిద్దరు తోడుంటారు- ప్రతి ప్రయాణంలోనూ అతని కష్టం ప్రాణాంతకంగా ఉండేది. వారంలో మూడు నాలుగు రోజులు యింటి నుంచి దూరం వుండాల్సి వచ్చేది. వచ్చిన కూలీ డబ్బుల్లో పెద్ద మొత్తం తిండికీ, తాగుడుకూ ప్రయాణంలోనే అయిపోయేది. ఇక కన్నన్ యింటికి తెచ్చేది- వారానికి మూడు నాలుగు రూపాయలే. అంటే తన ఖర్చులకు సరిపడేంత మాత్రమే తెచ్చే వాడన్న మాట. అందుకే యింటిల్లిపాదీ తినాలంటే జయమ్మా, ఆమె పిల్లలూ, రోజూ యిటుకల ఆవంలో కాలవలసి వస్తున్నది. ఆమె తన పిల్లల్ని బడికి పంపడం లేదంటే ఆశ్చర్యం ఏమీ లేదు. బడి చదువులతో వాళ్ళకు యింతకన్నా మంచి పని దొరకదు. అదిపోను, యిపుడు యీ పిల్లలు ఎంతో కొంత సంపాదించడం కుటుంబానికి తప్పని సరిఐంది- జయమ్మ మనుమరాలు ఒకామె అయిదో తరగతిదాకా చదివింది. ఈ

పిల్లే ఆ కుటుంబంలో చదువుకున్నామె. అయితే ఈమె కూడా యిప్పుడు యిటుకబట్టీ పనికి రావలసి వస్తున్నది.

జయమ్మకు తీరిక ఎన్నడూ లేదు. కుటుంబం కోసం ఆమె ఎల్లకాలం పని చేస్తూ వుండవలసిందే. ఎన్ని కాన్పులాయె !_ ఒక్క కాన్పుకైనా ఆమె నాలుగు రోజులు విశ్రాంతి తీసుకునే పరిస్థితి వచ్చిందా ? కాన్పు సమయం దాకా పనిచేయక తప్పని దుస్థితి ఆమెది. పని మానితే పస్తులుండాల్సిందే. ఇక యిప్పుడు మొగుడూ సంపాదించే స్థితిలో లేడు. మొత్తానికే ఆమె మీద ఆధారపడి వున్నాడు. పెళ్ళయి పోయిన కూతుళ్ళ పిల్లల్ని ఆడించుకుంటూ కూచుంటాడు. మొగవాడు కాబట్టి యింటి పని ఏదీ చేయడు. అందుకే తెల్లారక ముందే జయమ్మ నిద్రలేచి నీళ్ళు మోసు కొస్తుంది. ఇంటి చాకిరంతా ముగించుకొని ఓ కప్పు టీ కడుపులో పోసుకొని పనికి పోతుంది. పని తర్వాత, యింటికి వస్తూ, తిండి గింజలు కొనుక్కొస్తుంది. వేరే ఆడాళ్ళు కొందరు, యిళ్ళ నిర్మాణంజరిగే చోట బరువులు మోసే పనికి అప్పుడప్పుడు పోయి రోజుకు ఎనిమిది రూపాయలు సంపాదిస్తారు. కాని రోజుకు అయిదే దొరికే యీ యిటుకలు మోసే పనిని మాత్రం వదిలిపోదు జయమ్మ. ఎందుకంటే, యీ పని నాగాలేకుండా దొరుకుతుంది, పైగా యిక్కడ యజమాని అప్పులిస్తాడు, తన పిల్లలకు కూడా పని చూపిస్తాడు.

ఇటుక పని వాళ్ళకు సంఘం లేదు. మగ కూలీలకు కూడా. జీవితంలో చివరి రోజుల్లోనన్నా, కొడుకులు మాత్రమే సంపాయిస్తుంటే తను పని మాని కొంత విశ్రాంతిగా వుండాలని జయమ్మ ఆశ. కాని అది అడియాసే అయింది. కుటుంబంలో మిగతా అందరికీ అన్నమూ, చేపలూ తినిపించి, తను మాత్రం వాళ్ళు వదిలేసిన మెతుకులో, యింకే గడ్డో తిని, తన చివరి రోజులకోసం కాస్తా మిగుల్చుకుందామని ఎంత ప్రయత్నం చేస్తున్నా- ఏదీ- ఎక్కడ మిగులుతుంది ! వయోభారం పైబడ్డ కొద్దీ, శక్తి ఉడిగిపోతున్నది- ఎక్కువ యిటుకలు మోయలేక పోతున్నది. సంపాదన తగ్గిపోతున్నది. ఈ మధ్య చలిజ్వరం వచ్చి ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. అయినా పనికి పోక తప్పదు. కట్టుకున్న మొగవి కోసం, చిన్నపిల్లల కోసం, తన కోసం, ఆమె ఏదో కొంత సంపాదించక తప్పదు. ఇప్పటికే ఆ యిటుక బట్టీ పనిలో నిండా ముప్పయి యేళ్ళు కష్టపడింది. ఇంకెంత కాలం పని చేయడానికి ఆ ఒంట్లో సత్తువ మిగిలి వున్నదో ? ఆ తర్వాత ఏమి కానున్నదో ?

(లీలా గులతి వ్యాసం ఆధారం : EPW)

## ఇలాంటి సమస్య ఇదొక్కటే కాదు.

బొంబాయి పార్లే గ్లాకోబిస్కట్ కర్మాగారంలోని కార్మికులు 1978 సెప్టెంబర్‌లో ప్రారంభించి రెండుమూడు నెలల పాటు సమ్మె చేసారు. ఆ ఫ్యాక్టరీలో వున్న రెండువేల మంది కార్మికుల్లో స్త్రీలు ఎనిమిది వందల మంది. ఐతే ఇందులో ఐదు వందల మంది స్త్రీలు (టెంపరరీ లేబర్) తాత్కాలికంగా పనిచేస్తున్నవారే. వీళ్ళతో ఎనిమిది నెలలపాటు కూలీకి పనిచేయించుకుంటారు, తరువాత ఎనిమిది నెలలపాటు పనిలో నుంచి తొలగిస్తారు. ఈ పద్ధతిపైనే ఇరవైనాలుగు సంవత్సరాలపాటు టెంపరరీగా పని చేసిన స్త్రీలు కూడా వున్నారు. పర్మనెంట్ ఉద్యోగులుగా వున్న 25-30 స్త్రీలు ప్యాకింగ్ విభాగంలో పనిచేస్తారు. వీళ్ళకు 100 డబ్బాలు ప్యాక్ చేసినందుకు రు. 3.20 ఇస్తారు. మిగిలిన స్త్రీలు బిస్కట్లతయారీ విభాగం, మిఠాయి విభాగం అనే ముఖ్యమైన శాఖల్లో యంత్రాలపై పనిచేస్తారు. వీళ్ళకు పని భారం చాలా ఎక్కువగా వుంటుంది; పనిమధ్య ఒక ఐదునిమిషాలు కూడా విశ్రాంతి పొందలేరు. ఈ పని చాలా ప్రమాదభరితమైనది. ఈ విభాగాల్లో ఎంతో మంది స్త్రీలు విద్యుత్ షాక్‌కి గురికావల్సి వచ్చింది. కొంత మంది తమ చేతులను కూడ కోల్పోయారు ఈ బాధితులకి మేనేజిమెంట్ ఎలాంటి నష్టపరిహారాన్ని చెల్లించదు. ఈ స్త్రీల నెలసరి ఆదాయం దాదాపు నాలుగువందల నుండి ఐదువందల రూపాయలు వుంటుంది. కాని అప్పులు తీర్చి బయటి కొచ్చేసరికి వాళ్ళ చేతుల్లో రు. 200 మాత్రమే మిగులుతాయి.

స్త్రీలకు కల్పించబడవలసిన సాధారణ సౌకర్యాలు కూడా వీళ్ళకు చాలా తక్కువగా కల్పించబడ్డాయి. వీళ్ళకు ఉండే సెలవులు చాలా తక్కువ; దీనివల్ల చాలా మంది తమ స్వగ్రామాలను సంవత్సరాల తరబడి చూడనే లేదు. ఫ్యాక్టరీలో వీళ్ళకు బాధాకరమైన అంశం _ షిఫ్టు పని వేళలు; ఉదయం 6గం. నుండి మధ్యాహ్నం 2.50 గం., ఉదయం 7గం. నుండి మధ్యాహ్నం 3గం., మధ్యాహ్నం 1.30గం. నుండి రాత్రి 10గం,. వీటిలో చివరి షిఫ్ట్ ఎమర్జన్సీలో ప్రారంభించబడి ఇంకా కొనసాగుతున్నది. చాలా మంది స్త్రీలు మొదటి, మూడవ, షిఫ్టుల్లో పనిచేయవలసి ఉంటుంది. ఈ షిఫ్టుల్లో వీళ్ళు తెల్లవారకముందే చీకట్లో ప్రయాణించడంగాని, షిఫ్టు ఐపోయింతర్వాత రాత్రి ఇంటికి రావడంగాని తప్పనిసరి అవుతున్నది. ఈ చీకట్లలో దారిపై ప్రమాద అవకాశాలు ఎక్కువ వున్నాయి. మూడోషిఫ్టు తర్వాత

ఇంటికి వస్తున్న ఒకస్త్రీని ఎవరో అడ్డగించి, ఆమె దగ్గర వున్నదల్లంతా దొంగిలించారు. ఈ సంఘటన జరిగిన తర్వాత స్త్రీ కూలీలు ఈ సమస్యను యాజమాన్యంతో చర్చించవలసిందిగా యూనియన్‌పై ఒత్తిడి తెచ్చారు. స్త్రీ కూలీల డిమాండ్‌లు రెండు- ఒకటి స్త్రీలకు రాత్రి షిఫ్టును మార్చడం, రెండు కూలీరేట్ల పెరుగుదల. దీర్ఘకాల పోరాటం తర్వాత కూడా మొదటి డిమాండ్ అంగీకరించబడనే లేదు. చివరికి కుదిరిన ఒక రాజీ ఒప్పందం ఫలితంగా వేతనంలో డెబ్బయి మూడురూపాయల పెరుగుదల, బోరివిలి వరకు బస్సు ఏర్పాటు జరిగాయి. కాని చాలామంది స్త్రీలు బోరివిలికి దూరంగా ఉండడంవల్ల, బోరివిలిలో ఉన్నవాళ్ళు కూడా బస్సు తమను దింపిన చోటినుండి ఇళ్ళకు పోవడానికి చాలాదూరం నడిచిపోవలసి వున్నందువల్ల ప్రధాన సమస్య పరిష్కారం కానేలేదు.

ఈ స్త్రీలు బాధతోవున్నారు. "ఈ రాజీ నిజానికి మా ఓటమి- దాదాపు 3 నెలలు మేం సమ్మెచేసాం. మాలో చాలామందికి మాపటికి తినడానికి ఎట్లా వస్తుందో తెలియదు. అయినా మా డిమాండ్లు నెరవేరేవరకు పోరాటాన్ని కొనసాగించాలని నిశ్చయించుకున్నాం. కాని చివరకు మేం ఏం పొందాం?.... సమ్మెకాలంలో సమ్మె గురించి అడగడానికి యూనియన్ నాయకుల దగ్గరికి పోతూవుండే వాళ్ళం. సహనంతో ఉండాలని యాజమాన్యంతో చర్చలు పూర్తయ్యేవరకు వేచివుండాలని వాళ్ళు మాకు నచ్చచెపుతూ ఉండేవాళ్ళు. యూనియన్‌కు, యాజమాన్యానికి మధ్య ఏం జరుగుతున్నదో మాకు తెలుసుకునే అవకాశమే లేకపోయింది. ఇప్పుడు మళ్ళీ ఆ నాయకులు సమ్మె పిలుపిస్తే మేం సమ్మెచేసే పరిస్థితిలోలేము. అంత సమ్మెచేసి, ఆ కాలంలో కూలీని పోగొట్టుకున్నాం. ఐనా మా ప్రధానమైన డిమాండ్ సాధించుకోలేకపోయాం. బోరివిలికి ఒక బస్సును ఏర్పాటు చేసినందువల్ల స్త్రీలు నిరంతరంగా అనుభవిస్తున్న లైంగిక సంబంధమైన సమస్యలు పరిష్కరించబడలేదు" అని ఒకస్త్రీ అన్నది.

చాలామంది స్త్రీ కార్మికులు యూనియన్ కార్యకలాపాల్లో పాలు పంచుకోరనీ, సమ్మెచేయరనీ యూనియన్ నాయకుల, కార్యకర్తల ఫిర్యాదు. చాలామంది టెంపరరీ ఉద్యోగులు కావడం, ఉద్యోగ భద్రతలేకపోవడం ఇందుకు కారణాలు. స్త్రీల సమస్యలు యూనియన్ సరిగా పట్టించుకోకపోవడం ఇంకో కారణం. పై సమ్మెలో మాదిరిగా స్త్రీల సమస్యల విషయమై సమ్మె చేసినప్పటికీ చర్చల్లోనూ, నిర్ణయాలు తీసుకోవడంలోనూ స్త్రీలకు ప్రాతినిధ్యం లేకపోవడం ఇంకో కారణం. తమ స్వంత ట్రేడ్‌యూనియన్ చేతనే విడిచిపెట్టబడుతున్న ఈ స్త్రీల సమస్యలు ఏ

మహానగరంలో మహిళల సమస్యలు- ఉద్యమాలు :

## ఒక సమస్య, ఒక ఆశ, మరొక సమస్య, మళ్ళీ ఒక ఆశ.

ఢిల్లీనగరం ఈ దేశానికి రాజకీయంగానే కాదు, సాంస్కృతికంగా కూడా కేంద్రం. తరతరాల కరుడు గట్టిన ముస్లిమ్ మత మౌఢ్యానికి, అందమయిన ముసుగులో దాచుకునే అవసరమయిన వస్తువుగా స్త్రీని భావించే ఆర్ ఎస్ ఎస్ హిందూ ధృక్పథానికి, రహదారి నియాన్ లైట్ల వెలుగులో మెరిసే 'శరీరంగా జాతిజాతిని అమ్ముకునే వ్యాపార వ్యవహారానికి సాంఘిక ప్రతీక ఈ మహానగరం. అందుకే పట్టపగలు సిటీబస్సులలో స్త్రీలపై గుండాగిరీ నిరాఘాటంగా సాగుతుంది. సాయంకాలం వేళ రక్షణ లేకుండా స్త్రీలు బయట తిరగలేరు. చీకటిపడిం తర్వాత తోడు ఉన్నా రక్షణలేదు.

ఈ నగరంలోనే ఈ సంవత్సరంలో ఈ సంస్కృతికి నిరసన తెలియచేస్తూ, బలహీనంగానే అయినా, నిరసన వ్యక్తమయింది.

ఒక ఫిబ్రవరి మధ్యాహ్నం వేళ బ్రిటిష్ హైకమీషన్ ఎదురుగా రెండువందల మంది నిరసన ప్రదర్శన. అంతకు కొద్ది రోజుల ముందు లండన్ విమానాశ్రయంలో ఆసియాదేశ స్త్రీలపై బ్రిటిష్ ప్రభుత్వం జరుపుతున్న కన్యాత్వ పరీక్ష వివరాలు పత్రికలు బయటపెట్టాయి. వామపక్ష విద్యార్థి సంఘాల సహకారంతో ఒక తాత్కాలిక సమితి ఈ ప్రదర్శనను నిర్వహించింది. "కన్యాత్వ పరీక్షను రద్దుచేయండి" వలస వెళ్ళే వారి (Immigrants)పై అత్యాచారాలను ఆపండి, "తెల్ల జాత్యహంకారం నశించాలి" "ఆసియా గడ్డమీద సామ్రాజ్యవాద గోరీ లేస్తుంది." నినాదాలు హైకమీషన్ శాంతిపథ్ మీద 'శాంతి'కి భగ్నం చేశాయి. దౌత్య కార్యాలయం అధికారులు, దౌత్య నీతితో, లోపలే ఉండిపోయారు. ప్రదర్శకులకు చుట్టూ

---

విధంగానూ మినహాయింపుకాదు. మంచి వేతనాలు, ఉద్యోగరక్షణ, ప్రసూతిసెలవు, శిశురక్షణాలయాలు, రాత్రి పనివేళల మార్పు, లైంగిక దోపిడీ సమస్య- మొదలైన తమ డిమాండ్లను, సమస్యలను పట్టించుకోవడంలో తమ యూనియన్ విఫలమైనందు వల్ల పూణాలోని ఒక ఫ్యాక్టరీ స్త్రీలు విసుగుతో ఒక ప్రత్యేకమైన యూనియన్‌ను ఏర్పాటు చేసుకోవాలనుకుంటున్నారు. భారత ట్రేడ్‌యూనియన్ ఉద్యమం స్త్రీల సమస్యలను నిర్లక్ష్యం చేయడం, దీని యాభై సంవత్సరాల చరిత్రలో స్త్రీలు యూనియన్ల కార్యకర్తలుగానూ, నాయకులుగానూ లేకపోవడంగా పరిణమించింది. ఈ విషయమై ఆలోచించవలసిన సమయమిది. ఆ విధంగా మాత్రమే స్త్రీకార్మికులు ట్రేడ్‌యూనియన్లలో, శ్రామిక ఉద్యమాల్లో పూర్తిగా పాల్గొనగలరు.

(బొంబాయి 'ఫెమినిస్టు నెట్‌వర్క్' 3 4 5 సంచికల ఆధారంగా)

పోలీస్ వల, వలను ఛేదించుకుని విద్యార్థినులు గోడదూకి హైకమీషన్ ఆవరణలో ప్రవేశించి నినదించారు. పోలీసులు ఈ మొదటి ప్రదర్శనపైన లాఠీచార్జి చేశారు. అయినా ప్రదర్శన కొనసాగింది. నిరసన పత్రాన్ని ఎట్టకేలకు బ్రిటిష్ హైకమీషన్ అధికారులు తీసుకున్నారు. అక్కడే ఒక బహిరంగ సభలో విదేశీ జాత్యాంహాకారంపై నిరసన విజయవంతంగా ముగిసింది.

ఈసారి స్వదేశీ సంఘటనపైనే.

మార్చిలో నగరం సిటీబస్ (డి. టి. సి.)లలో స్త్రీలపై అత్యాచారాలను ఖండిస్తూ ప్రదర్శన.

లక్షలాది ప్రజలకి ఏకైక పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్ సిటీబస్‌లు, ఎప్పుడు చూసినా ఎడతెగని జనం, ఊపిరిసలపనివ్వని స్థలం, భద్రతలేని ప్రయాణం. ఈ రద్దీలో నలిగిపోయే స్త్రీలపై అసభ్యకరమయిన విసుర్లు, వారి శరీరాలపై చేతుల దాడులు సర్వ సాధారణం. స్త్రీ పురుషులను కఠినంగా, కృత్రిమంగా విడదీసే సమాజంలో శారీరక అవసరాల ఆకలి, దాన్ని పెంచి పోషించే సినిమా, వ్యాపార పత్రికల సంస్కృతి ఈ నీచమైన దాడికి దారితీస్తాయి. గుండాగిరీ దాని బలం. నిర్లిప్తంగా చూసే సమాజం, మనసారా ఆనందించే సాడిస్ట్ యువకులు, అన్యాయం అని భావిస్తూకూడా నోరెత్తలేని భయస్థులు- అందరి కళ్ళ ముందు ఈ దాడులు నిర్విఘ్నంగా సాగుతుంటాయి.

అంతకు కొద్దిరోజుల ముందు ఢిల్లీ విశ్వవిద్యాలయ స్త్రీల కళాశాలకు చెందిన ఒక విద్యార్థినిని నలుగురు గుండాలు హింసించినప్పుడు, దిక్కుతోచని ఆ విద్యార్థిని బస్సులోంచి కిందకు దూకి ప్రమాదానికి గురిఅయింది. ఆ సంఘటన ఒక కార్యాచరణ సమితికి ప్రేరణ అయింది.

ఇంద్రప్రస్థ స్త్రీల కళాశాల అధ్యాపకులు, విద్యార్థినుల ఆధ్వర్యంలో ఏర్పడిన ఈ కార్యాచరణ సమితి వెంటనే పత్రికా ప్రకటనలు, సంతకాల సేకరణతో ఉద్యమించింది. ఫలితంగా సుమారు ఎనిమిది వందల మందితో బలమైన ప్రదర్శన ముందుకు వచ్చింది. నగరం నడిమధ్యగా ఏడుమైళ్ళు సాగిన ఈ ప్రదర్శన పోలీస్ కమీషనర్‌కి. డి. టి. సి. ప్రధాన కార్యాలయానికి నిరసన పత్రాన్ని అందజేసింది. అపూర్వంగా జరిగిన ఈ మహిళా ప్రదర్శన నగరంలో, ముఖ్యంగా పత్రికలలో, సంచలనాన్ని రేపింది. అనేక పత్రికలు సమస్యపై ప్రత్యేక రిపోర్టులను ప్రచురించాయి. పార్లమెంటులో సావధాన తీర్మానం ప్రవేశపెట్టబడింది. కొన్ని చిన్న చిన్న విజయాల్ని కూడా సాధించింది. బస్‌లన్నింటిలోనూ స్త్రీలపై అత్యాచారాలను

చట్టప్రకారం నేరంగా ప్రకటిస్తూ హెచ్చరిక నోటీసులు జారీచేయబడ్డాయి. కాలేజీ-డి. టి. సి. - పోలీస్ ప్రతినిధులతో సమన్వయ కమిటీలు ఏర్పడ్డాయి.

కళాశాలలలో అనేక మంది సహకరించినా స్త్రీని అవమానించే ఈసంస్కృతికి ప్రధాన కేంద్రాలుగా విశ్వవిద్యాలయాలు ఏమీ తీసిపోలేదు. కనుక ఆ దిశలో ఇక సాంస్కృతిక పోరాటం....

* * *

ఢిల్లీ విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘం (DUSU) ఒక పెద్ద జూదం, మోసం. నగరమంతా అల్లుకున్న ఏభయి కాలేజిలలో లక్ష మందికిపైగా విద్యార్థినీ విద్యార్థులు గల ఈ యూనియన్‌లో ఆర్. ఎస్. ఎస్. లేక కాంగ్రెసు ధన బలం, గుండా బలంతో ఏర్పడే ఒక క్లబ్. ఈసారి యూనియన్ "మిస్ ఢిల్లీ యూనివర్సిటీ" అందాలరాణి పోటీని, లిమ్కా (కూల్‌డ్రింక్) సహకారంతో ఏర్పాటు చేసింది. హిందీనటుడు దేవానంద్ "రాణి"ని కిరీటంతో గౌరవిస్తాడని కార్యక్రమం. స్త్రీ సంఘర్ష కమిటీ వెంటనే ఇతర కాలేజి యూనియన్స్‌ని సంప్రతించి బహిష్కరణకై పిలుపు నిచ్చింది. పత్రికా ప్రకటల నుండి దేవానంద్‌కు టెలిగ్రాముల పరంపర వరకు పెద్ద ఎత్తున ప్రచారాన్ని సాగించింది.

"విద్యార్థినులను లిమ్కాకు దేవానంద్‌కు అమ్మకానికి పెట్టకండి" అన్న నినాదంతో జరిగిన ప్రచారం చివరికి పోటీజరిగే ఆడిటోరియమ్ బయట ప్రదర్శనగా పరిణమించింది. లోపల వాళ్ళు అద్దెకు తెచ్చుకున్న గుండాలతో పోటీ రసాభాస అయింది. పరీక్షల సమయమయినా అందాలరాణి పోటీలకు వ్యతిరేకంగా విశ్వవిద్యాలయమంతా బలమైన ప్రజాభిప్రాయాన్ని కలుగజేస్తూ ఆ ప్రదర్శన ముగిసింది.

మరి ఈ అందాలరాణుల కిరీటాలు తొడుక్కుంటున్న మిస్‌లు మిసెస్‌లయితే అత్తవారిళ్ళలో అనుభవిస్తున్న అగచాట్లు....

* * *

విశ్వవిద్యాలయం వేసవికాలం సెలవులలో - జూన్‌నెల రెండవతేది, ఉత్తర ఢిల్లీ మధ్యతరగతి వాళ్ళ కాలనీ - మోడల్‌టౌన్‌లో ఒక ఇంటి ముందు 200 మందితో ఒక వినూత్నమైన ప్రదర్శన జరిగింది. ఆ ఇంటి యజమాని వ్యాపార కుటుంబానికి చెందిన సత్పల్‌సింగ్ ఆనంద్. అంతకు రెండువారాల ముందు ఆ యింట్లోనే 24 ఏళ్ళ తర్విందర్‌కౌర్- ఇంటికోడలు- ఆత్మహత్యకు ప్రయత్నించిందని వార్త. కాని

ఆమె తన మరణవాఙ్మూలంలో అత్త, ఆడపడుచు కలిసి తన మీద కిరొసిన్ పోసి తగలబెట్ట ప్రయత్నించారని పేర్కొంది. ఆ రోజు మధ్యాహ్నం అంతా ఆనంద్ కుటుంబాన్ని సాంఘిక బహిష్కరణ చెయ్యవల్సిందిగా కోరుతూ ప్రదర్శన సాగింది. స్త్రీ సంఘర్ష సమితి అధ్వర్యంలో జరిగిన ఆ ప్రదర్శన ఆ కాలనీలోనే కాక ఢిల్లీలో అంతటా సంచలనాన్ని రేపింది. పత్రికలు ఈ సంఘటనకు ప్రాముఖ్యాన్నిస్తూ రిపోర్టు ఇచ్చాయి.

మధ్యతరగతి కుటుంబాలలో కట్నం కోసం జరిగే ఈ "ఆత్మహత్యలు" ఢిల్లీకి పరిపాటి. సాధారణంగా ఇది ఎక్కువగా వ్యాపార కుటుంబాలలో జరుగుతూఉంటుంది. రోజూ ఎక్కడో అక్కడ ఎవరో ఒక స్త్రీ ఆత్మహత్య చేసుకున్నట్టు వార్తలు వస్తూనే ఉంటాయి. ఇందులో ఎన్ని నిజంగా ఆత్మహత్యలో, ఎన్ని హత్యలో ఎవరికీ తెలియదు. పోలీసులు, ప్రభుత్వం, కోర్టు "సాక్ష్యంలేని" కేసులని పట్టించుకోవు. సాక్ష్యంవున్నా డబ్బు, అధికారం పలుకుబడి ముందు అది నోరులేనిదే అవుతుంది. స్త్రీ సంఘర్ష సమితి ఈ సమస్యను చేపట్టి ప్రభుత్వానికి, పోలీసుకు తమ విజ్ఞప్తి పత్రాన్ని అందచేసింది. మరణించిన యువతుల పక్షాన ఉచితంగా న్యాయ సహాయానికి ఏర్పాటు చేసింది. మొదటి ప్రదర్శన ఫలితంగా వెంటనే మరోచోట కూడా ప్రదర్శన జరిగింది. బోట్ క్లబ్ వద్ద ఒక జనరల్ ప్రదర్శన జరిగింది. నగరంలో అనేక సంస్థలు ఈ సమస్యపై సమావేశాలు నిర్వహించాయి.

* * *

ఈ నాలుగు ప్రదర్శనలు విజయవంతం కావడంలో సహకరించిన మొదటి అంశం: పత్రికలు నిర్వర్తించిన పాత్ర. ఈ సంఘటనలకు ప్రముఖ స్థానాన్ని ఇచ్చి ప్రచారాన్ని ఇవ్వడమే కాక ప్రత్యేకించి రిపోర్టులను ప్రచురించి సమస్యను ముందుకు తెచ్చాయి. ఈ నాలుగు ప్రదర్శనలు మొత్తం ప్రజానీకాన్ని పీడిస్తున్న సాంఘిక సమస్యలను తీసుకోవడం ద్వారా ఎక్కువ మందిని ఆకర్షించగలిగాయి. పెద్దగా ఆర్గనైజేషన్ బలం లేకపోయినా విజయవంతమైన ఈ ప్రదర్శనల అసంకల్పిత స్వభావానికి (Spontaneous nature) సమస్యల సాంఘిక పునాదికి దగ్గర సంబంధం ఉంది. సంఖ్యరీత్యా చిన్నవే అయినా ఈ ఉద్యమాలు ప్రభావరీత్యా విస్తృతమైనవి కావడానికి బహుశా అదే కారణం.

ఉద్యమంలో క్రియాశీలురుగా ముందుకొచ్చిన వాళ్ళల్లో రాజకీయంగా, సైద్ధాంతికంగా విభిన్న గ్రూపులున్నాయి. అయితే తీసుకున్న సాంఘిక సమస్య

# చట్టము - భారతీయ మహిళ

జస్టిస్ ఓ. చిన్నపరెడ్డి

1975 అంతర్జాతీయ మహిళా సంవత్సరం. అది విశ్వమంతటా మహిళాభ్యున్న తికి అంకితం చేయబడింది. కొందరు తమ భార్యలను మనసావాచా అర్ధాంగులుగా పరిగణించినా యింకొందరు అంతకుమించి గౌరవించినా ఈ పురుష ప్రపంచంలో పురుషుల కున్నన్ని హక్కులు స్త్రీలకు లేవనేది నిర్వివాదాంశం. భారతీయ మహిళా భ్యున్నతికి కృషి చేయాలనుకున్నప్పుడు వివిధ చట్టాలలో భారతీయ మహిళ స్థానాన్ని అవగాహన చేసుకొనవలసి వున్నది.

మన దేశంలోని మహిళల హక్కులు, స్థితిగతులు వారనుకరించే మతంమీద ఆధారపడి ఒక విధమైన ప్రత్యేకతను సంతరించుకున్నాయి. హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, పారశీక మతాలకు చెందిన స్త్రీల హక్కులు వారి మత సూత్రాలకు అను గుణంగా భిన్నంగా వుంటాయి. భారతదేశపు రాజ్యాంగంలోని 44వ ఆర్టికల్ దేశంలోని పౌరులందరకూ ఒకే విధమైన సివిల్ కోడ్ రూపొందించాలని నిర్దేశించినా ఆ విషయంలో యింతవరకూ ఏ ప్రయత్నమూ జరగలేదు. దానికి కారణం మైనారిటీ వర్గాల కోర్కెల, హక్కుల పరిరక్షణకు, కావలసిన దానికంటె అధికమైన గౌరవమిస్తున్నట్లు భ్రమింప చేయటమే.

---

మాత్రమే ప్రమాణంగా పరిగణించడంతో వివిధ గ్రూపులను, ఆలోచనాపరులను, అది ఐక్యం చేయగల్గింది.

ఢిల్లీ స్త్రీ విముక్తి ఉద్యమంలో నిర్మాణపరంగా కొన్ని సమస్యలు అంతర్లీనంగా ఉన్నాయి. పూర్తిగా రూపొందిన సంస్థ అంటూ ఏదీ ప్రస్తుతం దీన్ని నిర్వహించడం లేదు. నిర్వహణ వివిధ అభిప్రాయాల కలగాపులగం. ఉద్యమ బలం కూడా అక్కడే ఉంది. సంస్థ (organisation)ను ఉద్యమం ద్వారా నిర్మించాలనే ప్రాథమిక మార్క్సిస్టు సూత్రం ఆచరణలో ఎంతవరకు, ఎలా అమలు పెట్టడం సాధ్యమవుతుంది? తమతమ గ్రూపుల సమ్మకాలకి, నినాదాలకి స్త్రీ సమస్య అనే విశాలమైన సాంఘిక ఉద్యమానికి మధ్యఉన్న ఐక్యత, వైరుధ్యం ఈ క్రియాశీలురు ఎంతవరకు గుర్తించ గలరు? ఈ ప్రశ్నలకు సమాధానాలపై ఉద్యమ ప్రగతి ఆధారపడిఉంది. ఆ మేరకు ఢిల్లీ స్త్రీ విముక్తి ఉద్యమం ఒక సమాధానమే కాదు, మరోప్రశ్న కూడా.

అయితేనేం, ప్రత్యేకించి స్త్రీ సమస్యలపై సంఘటిత పర్చ ప్రయత్నించడం లోనూ, బలహీనంగానే అయినా, చైతన్యాన్ని ఉద్దేశింప చెయ్యడంలోనూ, వేళ్ళూన ప్రయత్నిస్తున్న ఈ ఉద్యమం ఒక ఆశకు ప్రతీక.

## కుమార్తెలకు ఆస్తి హక్కు

ఒక హిందువు పురుషుడైతే తాను జన్మించగానే సమిష్టి కుటుంబంలో ఆస్తికి హక్కుదారుడవుతాడు, అదే స్త్రీ అయితే అలా వీలులేదు. స్త్రీకి కేవలం తన పోషణకి, వివాహానికి సంబంధించిన వరకే హక్కు వున్నదిగాని తన సోదరునివలె సమిష్టి కుటుంబపు ఆస్తిలో వాటాకు హక్కులేదు. 1956 నాటి హిందూ వారసత్వ చట్టానికి పూర్వంవున్న చట్టం ప్రకారమైతే కుమార్తె తన సోదరులతోపాటు తన తండ్రి ఆస్తికి కూడ వారసురాలు అయ్యేందుకు వీలులేదు. 1956 నాటి హిందూ వారసత్వం అమల్లోకి రావటంతో ఆ సమస్య కొంత పరిష్కరింపబడి ఒక హిందువు మరణానంతరము విధవ పిల్లలు [పుత్రులు, పుత్రికలు] అతని ప్రత్యేక ఆస్తిని సమాన వాటాలలో పంచుకుంటారు. యిందులో పైకి కన్పించినంత న్యాయంగా పరిశీలించిచూస్తే కన్పించదు. ఎందుకంటే కుమారునికి పుట్టుకతోనే సమిష్టి కుటుంబంలో ఆస్తి పంచుకునే హక్కు లభిస్తుంది. కుమార్తెకు అది లభించదు. కుమార్తె కేవలం తన తండ్రి వాటాలోనే. అదీ తిరిగి తన సోదరులు, తల్లితో పాటుగా ఆస్తిని సమానంగా పొందే హక్కును కలిగి వుంటుంది.

ఉదాహరణకు ఒక సమిష్టి కుటుంబంలో ఒక తండ్రి, ఒక తల్లి, యిద్దరు కుమారులు, యిద్దరు కుమార్తెలు వున్నారనుకోండి. వారికి 60 ఎకరాలు పొలం వుందనుకోండి. ఆ ఆస్తిలో తండ్రికి, కుమారులకు ఒక్కొక్కరికి 20 ఎకరాలపై హక్కుంది. తండ్రి మరణానంతరం కుమారులకు తమ వాటా 20 ఎకరాలతోపాటు తమ తండ్రి వాటాలోని 4 ఎకరాలు అదనంగా లభిస్తే కుమార్తెలకు, తల్లికి మాత్రం ఒక్కొక్కరికి నాలుగు ఎకరాలు మాత్రమే సంక్రమిస్తుంది. ఈ మాత్రపు దానికే ఈ చట్టం అమలులోకి వచ్చినపుడు హిందూ న్యాయశాస్త్రంలో స్త్రీ హక్కులు, "స్టేటస్" విషయంలో విప్లవాత్మక మార్పులు తీసుకొని రాబడినట్లు ఎంతగానో కొనియాడబడింది.

## హిందూ వారసత్వ చట్టము

హిందూ వారసత్వ చట్టంలో స్త్రీలు పొందినంత గుర్తింపు అంతకుముందు పొందలేదన్నది వాస్తవమే. అయినా పైన వివరించిన ఉదాహరణలను బట్టి చూస్తే స్త్రీలకు పురుషులతో హక్కు సమానంగా సంక్రమించలేదు. సమిష్టి కుటుంబంలోని ఆస్తిపై జన్మరీత్యా కుమార్తెలకు కూడ సమానమైన హక్కు వుండాలని చట్టం చేయటంలో

కొన్ని యిబ్బందులు వున్నమాట వాస్తవమే. ఉదాహరణకు, కుమార్తెకు ఆ హక్కు కల్పించినట్లయితే తన ప్రాథమిక హక్కుకు ముప్పు వాటిల్లిందని కుమారుడు గోల పెట్టవచ్చు. అయినా ఆ గొడవ అంత శక్తివంతమైనది కాకపోవచ్చు లేదా ఆ యిబ్బంది అధిగమింప అలవికానిదేంకాదు. పోనీ అది చాలా యిబ్బందితో కూడుకున్న పని అని భావించినప్పటికీ కనీసం సమిష్టి కుటుంబంలోని తండ్రి వాటాకు హక్కుదారులు కేవలం విధవ భార్య, కుమార్తెలేనని తేల్చి, వారి హక్కులకు మెరుగులు దిద్దకూడదా? ఈ విధంగా చేస్తే సమిష్టి కుటుంబంలో కుమారులకున్న ఆస్తి హక్కుకు ఏ విధమైన ముప్పు వాటిల్లదు. పైగా ఆ మార్పులవల్ల కుమార్తెకు సంక్రమించిన ఆస్తి హక్కు, కుమారుల ఆస్తి హక్కుకు మించి ఉండదుకదా? మరి మొదటగా దీనిని ఎందుకు అమలులోకి తీసుకురాకూడదూ? నిజమే, నేడు స్వంతంగా తండ్రికి వున్న ఆస్తిపై కుమారులకు, కుమార్తెలకు సమానమైన హక్కు వున్నది. అయినా వ్యవసాయిక ప్రధానమయిన భారతదేశంలో కుటుంబంలో ఆస్తి సామాన్యంగా సమిష్టి రూపంలోనే వుంటుంది.

### మహమ్మదీయ స్త్రీల స్థితి

"స్టేటస్"లో కాకున్నా ఆస్తిహక్కు విషయంలో హిందూ స్త్రీలకంటే మహమ్మదీయ స్త్రీలు కొంచెం మిన్న. ఒక మహమ్మదీయ పురుషుని మరణానంతరం విధవకు ఆస్తిలో ఎనిమిదవ వంతు లభిస్తుంది. మిగతా ఆస్తిని కుమారులు, కుమార్తెలు పంచుకుంటారు. ఒక కుమార్తె ఆస్తి ఒక కుమారునకు వచ్చే ఆస్తిలో సగం మాత్రమే వుంటుంది. మొదటగా యిచ్చిన ఉదాహరణను యిక్కడ అన్వయించుకుంటే విధవకు 7-1/2 ఎకరాలు, ఒక్కొక్క కుమారునికి 17-1/2 ఎకరాలు, ఒక్కొక్క కుమార్తెకు 8 ఎకరాలు లభిస్తుంది. కేంద్ర ప్రభుత్వాన్ని మహమ్మదీయ స్త్రీ పురుషులకు ఆస్తి సంక్రమించే విషయంలో సమానమయిన హక్కులను కల్పించేందుకు తగిన చట్టాలను విధానసభలో ప్రవేశపెట్టవలసిందిగా నచ్చచెప్పవలసిన బాధ్యత మహమ్మదీయ సోదర సోదరీమణులపై వున్నది.

### క్రైస్తవుల స్థితి

భారతీయ వారసత్వ చట్టంలో క్రైస్తవులకు, పారశీకులకు ఆస్తి సంక్రమించే విధం వివరించబడివుంది. ఒక క్రైస్తవ పురుషుని మరణానంతరం అతని ఆస్తిలో మూడవ వంతు విధవరాలయిన భార్యకు సంక్రమించగా- మిగతాది కుమారులు.

కుమార్తెలు అందరూ సమాన వాటాలలో పంచుకునే హక్కును కలిగి వుంటారు. చూడగా యిది సమంజసంగానే వుంది. పారసీ పురుషుని మరణానంతరము అతని ఆస్తికి విధవరాలయిన భార్య, బిడ్డలు వారసులవుతారు. ఆస్తి పంపకంలో మాత్రం విధవరాలైన భార్య, పుత్రుల వాటాలు కుమార్తె వాటాకంటె రెట్టింపు వుంటాయి. కాని పారశీ స్త్రీ మరణానంతరం భర్త, బిడ్డలు ఆస్తిని సమానంగా పంచుకుంటారు. ఈ విధంగా వారసత్వ చట్టం పారశీల విషయంలో స్త్రీ, పురుషుల మధ్య వివక్షత చూపుతుంది. కనుక వీరి విషయంలో కూడ చట్టంలో మార్పు రావలసిన అవసరం వుంది.

హిందూ, మహమ్మదీయ, పారసీ, క్రైస్తవులలో వివాహాలు తిరిగి వివిధ చట్టాలమూలంగా కట్టుదిట్టం చేయబడ్డాయి. క్రైస్తవులలో వివాహం ఎప్పుడూ ఏక పత్నీ వ్రతమే. హిందువులు, పారసీల విషయంలో పూర్వం బహుభార్యాత్వము కొనసాగినా చట్టంద్వారా ఏకపత్నీవ్రతం అమలులోకి వచ్చింది. మహమ్మదీయ వివాహ వ్యవస్థలో యింకా బహుభార్యాత్వమే. ప్రత్యేకించి అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో కూడా కొనసాగటం నేలవిడిచిన సాము మాత్రమే. మహమ్మదీయునకు నల్గురు భార్యలుండవచ్చు. అవగాహన గల్గిన ఏ మహమ్మదీయుడు కూడా మహమ్మదీయ వివాహ వ్యవస్థలో ఏకపత్నీవ్రతాన్ని చట్టంద్వారా అమలులోకి తెస్తే కాదనడు. మహమ్మదీయ మహిళల హోదాను పెంచదలిస్తే వెంటనే మన పార్లమెంటు యీ సంస్కరణాయుతమయిన చట్టాన్ని రూపొందించవలసింది. కొన్ని ఇస్లామిక్ దేశాలలో బహుభార్యాత్వము ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నిషేధింపబడింది. అందువలన మన ప్రభుత్వం ఊగిసలాటతో నిమిత్తం లేకుండా ఇస్లామిక్ దేశాల విధానాన్ననుసరించి చట్టాలను రూపొందించవచ్చు.

## వధువులకు కనీస వయఃపరిమితి

ఈ విషయంలో హిందూ వివాహ చట్టము, ఇండియన్, క్రిష్టియన్ వివాహ చట్టము వధూవరుల మధ్య తారతమ్యాన్ని సృష్టించాయి. వివాహం చేసుకోవాలంటే వరునకు 18 సంవత్సరాలు నిండాలి. వధువుకు 15 సంవత్సరాలు నిండితే చాలు. అప్పటికి వరుడు మేజర్ అవుతాడు. వధువు మేజర్ కాని పక్షంలో వివాహానికి సంరక్షకుల అనుమతి వుండితీరాలి. మహమ్మదీయులు, పారసీల విషయంలో వధూవరులిరువురకూ 15 సంవత్సరాలు నిండితే వివాహం చేసుకోవచ్చు. అయితే మహమ్మదీయ బాలబాలికల విషయంలో వారికి యుక్తవయస్సు రాని పక్షంలో

సంరక్షకుల అనుమతి తీసుకోవలసి వుంది. అదే పారసీల విషయంలో అయితే వధూ వరు లిరువురకూ 21 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ సంరక్షకుల అనుమతి తీసుకోవలసి వుంది. ఈ తారతమ్యాల నన్నింటినీ తొలగించి అందరకూ ఒకే విధంగా కనీస వయఃపరిమితి 18 సంవత్సరాలుగా నిర్ణయించే విషయాన్ని పార్లమెంటు ఆలోచన చేయవలసి వుంది. 18 సంవత్సరాలయితే అందరూ తమ వివాహకాలం నాటికి తప్పక మేజర్లు అవుతారు కదా!

## విడాకులు

విడాకులచట్టం అందులోనూ ప్రత్యేకించి మహమ్మదీయుల విడాకులకు సంబంధించిన చట్టం ఎంతో సంస్కరింపవలసిన అవసరం వుంది. ముస్లిం లా ప్రకారం యుక్తవయస్సు వచ్చిన ఏ పురుషుడయినా తన భార్యకు ఏ కారణము చెప్పనవసరం లేకుండానే విడాకులు యివ్వవచ్చును. దానినే వారు "తలాక్" అంటారు. ఇంత కంటే ఘోరమయినది మరొకటి వుండబోదు. చాలా ఇస్లామిక్ దేశాలలో భర్త ఆ విధంగా "తలాక్" యిచ్చే పద్ధతిని న్యాయశాస్త్రంలో కొన్ని బిగింపులు చేశారు. భారతదేశంలో మహమ్మదీయులకు సంబంధించిన యీ విడాకుల సూత్రాలను సంస్కరింపవలసిన అవసరం ఎంతోవుంది. భర్త తాను, కారణం చెప్పకుండా విడాకులిస్తున్నా నని ఒక్కమాట చెప్పి విదిలించుకుపోవచ్చుగాని భార్యకు మాత్రం భర్త అలా చేసేందుకు అనుమతినిస్తే తప్ప "తలాక్" యివ్వడానికి వీలులేదు.

ఎలాగయితేనేం 1939 ముస్లిం వివాహ చట్టంద్వారా భార్యకూడ యీ క్రింద పేర్కొన్న కొన్నిసందర్భాలలో విడాకులు యిచ్చేయడానికి కోర్టులోదావా వేసుకునేందుకు అవకాశం కల్పించబడింది.

1) నాలుగు సంవత్సరాలకాలం భర్త అదృశ్యుడయితే 2) రెండు సంవత్సరాల పాటు భార్యయొక్క పోషణను అశ్రద్ధ చేసినట్లయితే 3) ఏడు సంవత్సరాలపాటు భర్త కారాగారము పాలయివుంటే 4) వైవాహిక బాధ్యతలను నెరవేర్చడంలో భర్త విఫలుడయితే 5) భర్త నపుంసకుడయితే 6) పిచ్చివాడయితే 7) క్రూరుడయితే— విడాకులకొరకు దావా వేయవచ్చును. భర్తకుగల "తలాక్" అధికారాన్ని రద్దు చేయవలసినదిగాను, దాని బదులుగా భర్తనుండి విడాకులు పొందడానికి-1939 చట్టంలో భార్యకు ఏ అవకాశాలున్నవో, అలాంటి అవకాశాలనే భార్యకు విడాకులు యివ్వడానికిగాను భర్తకు కల్పించాలనీ కోరబడింది.

1955 హిందూ వివాహ చట్టం మొట్టమొదటిసారిగా హిందూ స్త్రీకి విడాకులు కోరే అధికారాన్ని యిచ్చింది. భర్త జారుడయితే, మతాంతరుడుగా మారితే, బాగు చేయలేని విధంగా మతిచెడినవాడయితే, కుష్టురోగి అయితే, మూడేండ్లపాటు సుఖ రోగాలతో బాధపడుతూవుంటే, సన్యాసము స్వీకరించివుంటే, లేదా ఏడు సంవత్సరాల పాటు కానరాకుండాపోతే, భార్య భర్తనుండి విడాకులు కోరవచ్చును. వదలివేయడం, లేదా క్రూరత్వం, లేదా పోషణలో అలసత్వమనేది విడాకులకు ఆధారంగా భావించ బడకపోవడం గమనార్హం. యివి విడాకులకు గాక ప్రత్యేక గృహంలో జీవించడానికి మాత్రం హిందూ ఎడాప్షన్ అండ్ మెయిన్‌టెనెన్స్ ఆక్టు ద్వారా అర్హతలుగా గుర్తించబడ్డాయి. అలాగే రెండేండ్లపాటు వదిలివేయడం జరిగితే, లేదా కలిసి జీవిం చడం తనకు ప్రమాదకరమని భార్య భావించి, విశ్వసించడానికి తగినంత క్రూరత్వం భర్త ప్రదర్శిస్తే– అప్పుడు జుడీషియల్ సెపరేషన్ (చట్టబద్ధమైన వేర్పాటు) పొంద వచ్చును. అట్టి "వేర్పాటు" పొందిన రెండు సంవత్సరాల పిదప మధ్యకాలంలో యిద్దరు కలియకపోతే, భార్య విడాకులకై అర్జీ పెట్టుకోవచ్చును.

ఒక భార్య తాను నేరుగా వదలివేయడం, లేదా క్రూరత్వం, అలసత్వముల కారణంగా విడాకులు పొందడానికి ఆటంకం, సహేతుకం కాదు. ముందు చట్టబద్ధమైన వేర్పాటు, ఆ పిదప రెండేండ్లు వేచివుండడం, ఆ పిదప విడాకులూ – యీ క్రమం అవసరం లేదు. యీ రెండేండ్ల కాలంలో భర్త తాను మంచి ప్రవర్తన కలిగివున్నట్లు నటించి, మభ్యపెట్టి భార్యతో సమాగమించి, విడాకులు పొందే అవకాశాన్ని వమ్ము చేయవచ్చును. పోషణలో వైఫల్యం, వైవాహిక బాధ్యతలు నెరవేర్చకపోవడం, క్రౌర్యమనేవి 1939 ముస్లిం వివాహాల రద్దు చట్టం ప్రకారం విడాకులకు తగిన ప్రాతిపదికలు అని పైనే చెప్పివున్నాను. కనుక హిందూ వివాహ చట్టాన్నిగూడా దానితో సమానం చేయవచ్చును.

క్రైస్తవ లేదా పార్శీ స్త్రీల పరిస్థితిగూడా ఏమంత మేలుగాలేదు. ఒక పార్శీ వనిత క్రౌర్యము, లేదా పోషణలో అలసత్వములు ఆధారంగా విడాకులు పొంద జాలదు. కాగా క్రౌర్యప్రవర్తన ప్రాతిపదికమీద చట్టరీత్యా వేర్పాటును మాత్రం కోరవచ్చును. ఒక క్రైస్తవ వనిత భర్త క్రౌర్యం, వదిలివేయడం, పోషణలో అలసత్వం తుదకు వ్యభిచారం – ప్రాతిపదికమీదగూడా విడాకులు పొందజాలదు. ఇండియన్ విడాకుల చట్టం క్రింద ఆమె భర్త (incest)[1] వ్యభిచారం చేసినా, బహుభార్యాత్వానికి పాల్పడినా, లేదా వ్యభిచారంతోపాటు క్రౌర్యానికిగానీ, వ్యభిచారంతోపాటు వదలి

చేయడానికిగానీ పాల్పడినా, విడాకులీయవచ్చును. అంతేగాని కేవలం వ్యభిచారం, లేదా క్రౌర్యం లేదా వదలిపేయడం అనే నేరాలకు విడాకులు అడిగే వీలులేదు. కనుక యీ ఇండియన్ విడాకుల చట్టంలోని అంశాలు పూర్తిగా కాలదోషం పట్టినవనడంలో సందేహంలేదు. వానిలో సంస్కరణ జరిగి తీరాలి.

మైనరు పిల్లల రక్షణ

మైనరుపిల్లల రక్షణ, గార్డియన్ షిప్‌ల విషయంలోగూడా చట్టం తల్లికి వ్యతిరేకంగా తండ్రిపట్ల పక్షపాతాన్ని ప్రదర్శిస్తోంది. బిడ్డలకు 5 సం॥ వచ్చేవరకూ హైందవమాత రక్షణకిృంద వుండడానికి ప్రాధాన్యత యివ్వబడింది. ముస్లిమ్ తల్లి తన కుమారునికి 7 సం॥ దాటేవరకూ, కుమార్తె యీడేరేవరకూ సంరక్షణ హక్కులు కలిగివుంటోంది. యిది మినహాగా పిల్లల పోషణ, సంరక్షణ హక్కు హిందూ, ముస్లింమతాలు రెంటిలోనూ తండ్రులదే. ఈనాడున్న చట్టప్రకారంకు మార్తె యొక్క అవసరం తల్లికి ఎప్పుడు ముఖ్యంగా అవసరమో, సరిగ్గా ఆ సమయానికి కుమార్తె తల్లినుండి వేరు చేయబడుతుంది.

"పర్సనల్‌లా"కు సంబంధించిన వాటిలో యివి కేవలం కొన్ని అంశాలు. కొద్దిపాటి చట్ట సంస్కరణద్వారా వీటిని సరిచేయవచ్చును. యివి చాలా మౌలికమైన మార్పులు. అవి జరగకుండా భారత స్త్రీలకు చట్టరీత్యా యివ్వబడే స్థాయి, హోదాలలో, హక్కులలో మార్పు సాధ్యంకాదు. కనుక యీ దిశగా తగిన చట్టబద్ధమైన సంస్కరణలకు వెంటనే పూనుకోవాలి. ఆ విధంగా రెండు లక్ష్యాల దిశగా సంస్కరణ ప్రారంభమవుతుంది: ఒకే సివిల్ చట్టం నిర్మాణం కావడం, స్త్రీల సంక్షేమం సాధించబడడం.

('సమతా పబ్లికేషన్స్' సౌజన్యంతో)

1. sexual intercourse of near kindred (e. g. brother and sister)

విప్లవం యొక్క విజయం దానిలో స్త్రీలు ఎంతగా పాల్గొంటారనే దానిమీద ఆధారపడుతుందని సకల విమోచన ఉద్యమాల అనుభవమూ తెలియజేసింది.

\- లెనిన్

# భర్తలువదిలేసిన స్త్రీలు

భర్తలువదిలేసిన స్త్రీలకు సంఘంలో సరియైన స్థానంలేదని, చట్టం కూడా యిటువంటి స్త్రీకి రక్షణ సరిగా కల్పించడంలేదని, ఈ అక్టోబర్ 4న మద్రాసు హైకోర్టు అభిప్రాయపడింది. ఒక కేసులో తీర్పు చెప్తూ న్యాయమూర్తి శ్రీ టి. సత్యదేవ్ హిందూ వివాహ చట్టంలో కొన్ని మార్పులు తీసుకురావాలని సూచించారు.

భర్తచే వదిలిపేయబడ్డ స్త్రీని సాధారణంగా గౌరవించరు, తక్కువగా చూస్తారు. ఆమెకు భర్తకు పెళ్ళినాడున్నప్పటి ఆస్తిలో సగం గానీ, వదిలిపేసిననాడున్న భర్త ఆస్తిలో యిదే లెక్కన వాటా గానీ, (ఏది ఆ స్త్రీకి ఎక్కువ మేలో అది) వచ్చేలా చూడాలని న్యాయమూర్తి అభిప్రాయపడ్డారు. (భర్త విడాకులు కోరితే).

న్యాయమూర్తి చేసిన యింకొన్ని సూచనలు: 1) పిల్లలు తల్లి సంరక్షణలోనే వున్నట్లయితే, ఆమెకు, పిల్లలకు బతకడానికి సరిపడేంత డబ్బు తండ్రి యివ్వాలి; యిదిగాను పిల్లలను భావిపౌరులుగా తీర్చిదిద్దడంలో తల్లి తీసుకునే శ్రద్ధ, తల్లిపడే ఆందోళనలకు ప్రతిఫలం కూడా ఆమెకు ఆమె భర్త ముట్టచెప్పాలి. 2) భర్త విడాకులు కోరితే, అతను భార్యా పిల్లలకు నెలనెలా మెయింటెనెన్స్ డబ్బు యిస్తున్నాడు అనే విషయం నిర్ధారణ కావాలి. 3) విడాకుల కేసు పరిష్కార మయ్యే సరికి చాలా కాలం పట్టకుండా వుండేందుకు గాను హిందూ వివాహ చట్టంలో భర్తను కట్టుదిట్టంచేయాలి.

చట్టంలో ఈ మార్పులు చేయడం వలన స్త్రీకి కలిగే లాభం కాగితాలకే పరిమితం కాకుండా కూడా జాగ్రత్త తీసుకోవాలి. కోర్టు నిర్ణయించిన రీతిలో ఆమెకు డబ్బు, ఆస్తి దక్కాలి.

ఈ కేసులో భర్త క్రౌర్యం వల్ల భార్య అతనికి దూరమైంది. అతను మరో స్త్రీతో వుంటున్నట్టు కూడా ఆమె ఆరోపించింది. తిరునల్వేలి సబ్‌కోర్టులో భర్త విడాకులు అడిగాడు. చేసిన తప్పు నుండి కూడా లాభం పొందాలని చూస్తున్నాడని సబ్‌కోర్టు విడాకులిప్పించలేదు.

అయితే, ఆమెకు పిల్లలు కలుగనందువల్ల ఆమెను తాను వదిలేసానని భర్త చెప్పినదానిని జిల్లా కోర్టు ఒప్పుకుంది. అప్పుడు ఆమె హైకోర్టుకు పోవలసివచ్చింది.

హిందూ వివాహ చట్టం ప్రకారం, వదిలేయబడిన స్త్రీకి వచ్చేది ఏమంటే కేవలం బతుకు తెరువుకు భర్తను అడుక్కునే హక్కు — అని న్యాయమూర్తి

అన్ని మతాలూ స్త్రీని చిన్న చూపు చూసేవే.

హిందూ మతంలో సహగమనం, బాల్యవివాహాలు, వితంతు వివాహాల నిషేధం మొదలైనవాటి ద్వారా స్త్రీలకు తీరని అన్యాయం చేసారు. మనువు స్త్రీల మంచి కోసమే చెప్పాడంటున్నదంతా స్త్రీని అణచేసిన సమాచారమే. మనుస్మృతి ప్రకారం స్త్రీలు బానిసలు. భర్త ఎలాంటి వాడైనా స్త్రీ అతన్ని దేవునిలా పూజించాలి, అతనికి విశ్వాసపాత్రురాలై వుండాలి. అతడు ఆమెను పశువును బాదినట్టు బాదవచ్చును. ఆస్తి, చదువు, స్వేచ్ఛ స్త్రీకి అక్కరలేదు. మగవాణ్ణి తుచ్ఛమైన కోరికలవైపు, చెడువైపు స్త్రీ తీసుకుపోతుంది – అని మనువు చెప్పాడు. స్త్రీలు పాపం యొక్క గర్భంలో పుట్టినవాళ్ళని భగవద్గీత చెప్తుంది. వాళ్ళు నరకానికి సింహద్వారం వంటి వారని శంకరాచార్యుడు చెప్పాడు.

తురక (ఇస్లాం) మతంలో స్త్రీలు జంతువులతోను, దున్నే పొలంతోను పోల్చబడ్డారు. స్త్రీలకు బురఖా వేసి వాళ్ళు ప్రపంచాన్ని సరిగా చూడకుండా చేసారు; ఇతరులు వాళ్ళను చూడొద్దని కూడా అంక్ష. ఈ మతం స్త్రీ తానూ ఒక వ్యక్తిగా సమాజంలో పాల్గొనడం నేరం. ఆమెకు స్వేచ్ఛ అసలే లేదు. చదువుకోకూడదు. ఇప్పుడిప్పుడే కొంత సడలింపు కనిపిస్తున్నది.

క్రైస్తవ మతంలో పాపానికి కారణం స్త్రీ అని చెప్పబడింది. మగవాణ్ణి ముందుగా 'సృష్టించిన' యెహోవా ఆ మగవాని కామతృప్తి కోసం స్త్రీని 'సృష్టించాడట'. అయితే తృప్తి యిచ్చిన స్త్రీని మగవాడు వదిలివేయడం కూడా

---

అభిప్రాయపడ్డారు. విచిత్రమేమిటంటే, చాలా కేసుల్లో, యీ కేసులో లాగానే, వదిలేసిన స్త్రీకి భర్త నెలకు యిరవై అయిదు రూపాయలివ్వాలని కోర్టు తీర్పు చెప్తుంది. ఏడాదికి దాదాపు రెండు బస్తాల బియ్యం, అయిదు రూపాయల నగదు, ఒక చీరె, ఆమెకు యివ్వాలని కొన్ని కేసుల్లో తీర్పు యిచ్చారని న్యాయమూర్తి చెప్పారు.

హిందూ వివాహ చట్టం 23వ సెక్షన్ కింద స్త్రీకి అందాలంటున్న కొద్ది సహాయం కూడా సరిగా అందడం లేదు. ఈ సహాయం పొందే ఆర్డరు స్త్రీ చేతికి వచ్చినా, ఏళ్ళ తరబడిగా ఏ మాత్రం డబ్బూ, సహాయమూ పొందలేని స్త్రీలు వున్నారు. పద్ధతులూ, రూల్సూ అట్లా వున్నాయి. పదేళ్ళు దాటినా భర్తల నుండి ఒక్క పైసా కూడా వదిలేసిన స్త్రీకి కోర్టులు యిప్పించలేక పోయాయని న్యాయమూర్తి చెప్పారు. ఆయన ఈ కేసులో భర్త కోరినట్లు విడాకులు యిప్పించలేదు.

దేవునికి యిష్టమే. చర్చిలో స్త్రీ ప్రసంగించడం, మాట్లాడడం సిగ్గుమాలిన పని అని మతగ్రంథం 'బైబిల్'లో వున్నది. మతబోధనలు చేయడానికి స్త్రీలు పనికిరారని పోప్ జాన్ పాల్ II మొన్న అమెరికాలో మళ్ళా మళ్ళా చెప్పాడు. "న్యాయానికి లింగభేదం లేద"ని రాసున్న అట్టలు పట్టుకొని యాభై మంది సన్యాసినులు (నన్స్) తమ అసమ్మతిని తెలియజేస్తే, ఇది మానవ హక్కులకు సంబంధించిన విషయం కాదన్నాడు పోప్. కుటుంబ నియంత్రణ చేసుకోవద్దనీ, అబార్షన్ కూడా మతానికి వ్యతిరేకమనీ, పోప్ నొక్కి చెప్పాడు. అయితే అమెరికాలోని కేథలిక్కులు ఈ లౌకిక విషయాల్లో ఆయన (మతం) మాట వినేలా లేరు.

కాలం చెల్లిన శాసనాల పూర్తి బరువును మోయవలసింది కార్మిక వర్గ మహిళే; అయితే, పాత శాసనాలతో పోరాడడం కంటే మతంతో పోరాడడం కష్టం — అని లెనిన్ చెప్పాడు. "మత దురభిప్రాయాలతో పోరాటం చేయడంలో మనం మహా జాగ్రత్తగా వుండాలి. మత భావాలను నొప్పించడం ద్వారా కొంతమంది యీ పోరాటంలో చాలా హాని కలిగిస్తున్నారు. మనం ప్రచారాన్నీ, విజ్ఞాన బోధననూ ఉపయోగించాలి. పోరాటానికి మితిమీరిన పదును పెట్టడం ద్వారా మనం ప్రజలలో నిరసనను మాత్రమే కలిగించవచ్చు; అలాంటి పోరాట పద్ధతులు మతగతమైన ప్రజల విభజనను శాశ్వత పరచడానికి అభిముఖంగా వుంటాయి; కానీ మన బలం ఐక్యతలో వున్నది. మత దురభిప్రాయానికి అత్యంత లోతైన మూలం దారిద్ర్యమూ, అజ్ఞానమూ; అది మనం పోరాడవలసిన కీడు" అని కూడా లెనిన్ చెప్పాడు.

---

చరిత్ర గతిలో వివాహ రూపాలలోనూ, కుటుంబ రూపాలలోనూ వచ్చిన మార్పుల గురించిన జ్ఞానమూ, అవి ఆర్థిక విషయాల మీద ఆధారపడతాయనే జ్ఞానమూ, శ్రామిక మహిళల మనస్సులలో బూర్జువా సమాజపు నిత్యత్వాన్ని గురించి వున్న నిరాధారమైన భావాన్ని తొలగించడానికి ఉపకరిస్తాయి. — లెనిన్

---

పస పిట్టల గుంపులాగ కిచకిచ మనకండి— యోధులలాగ బిగ్గరగా, స్పష్టంగా మాట్లాడండి.... పోరాడగలమని మీరు నిరూపించండి. సహజంగానే, మొట్టమొదట మన శత్రువులతో కానీ, అవసరమైతే, పార్టీ లోపల కూడా. యేమైనా విశాలమైన స్త్రీ జనాలకు సంబంధించిన సమస్య యిది.... స్త్రీలు మనపక్షాన లేకపోతే, ప్రతిఘాత విప్లవకారులు వాళ్ళను మన మీదికి ఉసికొల్పడంలో కృతార్థులు కావచ్చు. మనమిది ఎప్పుడూ మనసులో పెట్టుకోవాలి. — (స్త్రీ ఉద్యమకారులతో) లెనిన్

---

# ఎవరు వ్యభిచారులు? ఎవరు నేరస్తులు?

రమీజాబీని పోలీసులు బలవంతంగా చెరచినపుడు, షకీలాను పోలీసులు బలవంతంగా చెరచి చంపినపుడు పోలీసులు బలంగా తెచ్చినవాదన ఏమిటంటే వాళ్ళు ఇద్దరూ ఒళ్ళమ్ముకుని బతికేవాళ్ళనీ, చెడిపోయిన వాళ్ళనీ. పోలీసును, ప్రభుత్వాన్ని విమర్శించి వీళ్ళ విషయంలో న్యాయవిచారణ చేయాలని కోరిన వారంతా ఎంతసేపూ వీళ్ళు సంసార స్త్రీలని, ఒళ్ళమ్ముకుని బతికే స్త్రీలు కాదని నిరూపించడానికి డిఫెన్సులో పడిపోయారు. కాని ఒక్కరయినా, ఏ ఒక్కరో ఇద్దరో తప్ప, ఒళ్ళమ్ముకుని బతికే వాళ్ళయితే మాత్రం చెడిపోయిన వాళ్ళయితే మాత్రం, బలవంతంగా చెరచే లైసెన్సు పోలీసులకుందా అని అడగలేదు. పోలీసులేకాదు, ఏ మొగవాడయినా, ఒళ్ళమ్ముకుని బతికే స్త్రీనయినా తాను కొనగల 'మొగధీరుడు' కనుక ఆమెకు ఇష్టంలేకున్నా కొనవచ్చునా? ఒక జంతువు లాగా వాడుకొనవచ్చునా? చివరకు భర్త అయినా భార్య విషయంలో ఆమె స్వచ్ఛంద మైన అంగీకారం లేకుండా లైంగిక వాంఛ తీర్చుకోవచ్చునా? ఈ ప్రశ్నలు పోలీసులకు వేస్తే నవ్వేపోతారు- ఎందుకంటే ఒళ్ళమ్ముకుని బతికే స్త్రీలు పోలీసులకివ్వాల్సిన మామూళ్ళలో ధన, మాన, ప్రాణాలున్నాయి. అలా ప్రాణాలు పోయిన షకీలాల విషయంలో ప్రజల కోపాగ్ని కీలలు రగిలినపుడు మాత్రమే అరకొర విషయాల్లో ఈ సత్యాలు బయట పడతాయి. చెడిపోయిన స్త్రీని చెడగొడితే ప్రశ్నిస్తారేమిటి అని ఒక సహజధర్మాన్ని సవాల్‌చేసినంతగా ఆశ్చర్యపోయి అసలిందులో సమస్యే లేదని తేలకొడుతారు పోలీసు అధికారులు, నాయకులు. కాని మేమీ ప్రశ్న నాగరిక సమాజానికి వేస్తున్నాం.

రమీజాబీ భర్త హుస్సేన్‌ను తార్పుడుగాడనీ, షకీలా భర్త హైదీని కేడీ అని ఆరోపిస్తున్నారు పోలీసులు. నిజమే అని వాదానికి అంగీకరించినా (తన భార్యను పోలీసులకు తార్చనందుకు!) తార్పుడు గాళ్ళను పోలీసు స్టేషన్‌లో కొట్టి చంపవచ్చునని, కేడీలను వారాల తరబడి పోలీసు కస్టడీలో (అతని భార్యతో బలవంతంగా తమ కామ దాహం తీర్చుకోవడానికి వీలుగా) పెట్టి చిత్రహింసలు పెట్టవచ్చునని ఏ చట్టం చెప్తున్నది?

చెడ్డవాళ్ళని తాము భావించిన లేదా ఆరోపించిన వాళ్ళ ఎడ చట్టానికి, న్యాయానికి అతీతంగా తాము ప్రవర్తించవచ్చునని పోలీసులనుకుంటే, అవును ప్రవర్తించవచ్చు ననుకునేవాళ్ళంతా చట్టంలో న్యాయంలో విశ్వాసమున్న వాళ్ళనే నమ్మవచ్చునా?

ఈ ప్రశ్న కూడ- పోలీసులకు కాదు- ప్రజాస్వామ్యవాదులకు వేస్తున్నాం మేం.

ఎక్కడా ప్రకటించుకోకపోయినా హక్కులు అధికారం పాలకవర్గాల ప్రివిలెజెస్ అని ప్రశ్నించకుండా అంగీకరించడం భూస్వామ్య సంస్కృతి స్వభావంలో వుంది, నీతి, ధర్మం, శాస్త్రం, చట్టం అన్నీ ఈ స్వభావానికే లోబడిన పనిముట్లు.

'తన్నోడి నన్నోడెనా, నన్నోడి తన్నోడెనా' అని ప్రశ్నించినందుకు ఐదుగురు భర్తల భార్య అయినందుకు (అది ఆమె కోరుకొని ఎంచుకున్నది కూడకాదు), ద్రౌపది బల వంతంగా సభలోకి ఈడ్చబడ్డది- దుర్యోధనుడు తన తొడమీద కూర్చోమ్మని పిలిచేం తగా లోకువయింది.

మహిళా సంఘం పెట్టుకున్నందుకు, మామీద ఇంక సాంఘిక,ఆర్థిక దౌర్జన్యం సాగనివ్వమన్నందుకు కుదురుపాక రాజవ్వను ఒక ఏభైఏళ్ళ హరిజన స్త్రీని- ఆరుగురు భూస్వాముల గుండాలు చెరిచారు.

ఈ రెండూ కేవలం కామతృష్ణ కాజాలవు. పాలకుల అధికారాన్ని, హక్కును పాలితులమీద అప్రతిహతమని నిరూపించుకునేందుకు వర్గాలుఏర్పడిన నాటి నుంచీ ప్రదర్శిస్తున్న సాంఘిక దౌర్జన్యాలు, ఏ వర్గానికి చెందిందయినా స్త్రీ అయినందువల్లనే పాలితురాలవుతున్న అసమానతకు నిదర్శనాలు.

రాముణ్ణి ప్రేమించిన (?!) నేరానికి శూర్పణఖ ముక్కు చెవులు కోసాడు లక్ష్మణుడు.

బంగారు గొలుసు దొంగతనం చేసాడనే నేరం ఆరోపించి మంథెనలో ఒక హరిజన యువకుణ్ణి చంపారు. ఒక హరిజన స్త్రీని మానభంగంచేసి యోనిలో ఇనుపముక్కలు దూర్చి దారుణంగా హింసించి చంపారు.

ప్రజల భూములను, కష్టాన్ని దోచుకున్నట్లే ప్రజల స్త్రీలను దోచుకోవడం తన జన్మహక్కుగా భావిస్తుంది ఈ భూస్వామ్య సాంఘికనీతి.

ఒళ్ళమ్ముకునే స్త్రీలు ఆ అనివార్యమైన దైన్యానికి ఒడిగట్టడానికీ దొంగలు, నేరస్తులు అలాకాక తప్పని పరిస్థితులకూ బాధ్యులైన మంత్రులు నాయకులు అధికారులు బహిరంగంగా వ్యభిచరిస్తుంటే, పబ్లిగ్గా నేరాలు, దొర (దొంగ) తనాలు చేస్తుంటే వాళ్ళ కావలికుక్కలైన పోలీసుల తోకలు వంకరున్నాయని వంకపెట్టి ఏం ప్రయోజనం?

---

## స్త్రీల ఇంటి చాకిరీ

### లెనిన్

ఇంత కాలమూ స్త్రీల స్థానం బానిసల స్థానంతో సమానంగా వుంది. స్త్రీలు ఇంటికి కట్టివేయబడుతూ వచ్చారు. స్త్రీలు అనుభవిస్తోన్న రకరకాల దోపిడీల మూలంలో దెబ్బకొట్టాలని ఇప్పటి వరకూ ప్రపంచంలో ఏ వ్యవస్థా, ఏ ప్రభుత్వమూ తలపెట్టలేదు. కారణం- ఆ దెబ్బ పవిత్రమైన స్వంత ఆస్తికి తగులుతుంది గనక. సోషలిజం ఒక్కటే స్త్రీలని అన్ని దోపిడీల నించీ రక్షించగలుగుతుంది.

ఇంటి చాకిరీ స్వభావం— సమాజానికి అవసరమైన ఉత్పత్తి సృష్టించలేనిది (unproductive), స్త్రీల అభివృద్ధికి ఏ రకంగానూ, ఏ విషయంలోనూ, ఎంత మాత్రమూ ఉపకరించనిది. పైగా ఈ బండచాకిరీ అతిక్రూరంగా, ఆటవికంగా స్త్రీల కాలాన్నీ శక్తినీ మింగేస్తుంది. స్త్రీల సృజనాత్మకతని చంపేస్తుంది. స్త్రీల ఆత్మలనూ మెదళ్ళనూ మొద్దుబారుస్తుంది. సాంఘికంగా స్త్రీల స్థాయిని నీచపరుస్తుంది. క్షణకాలమైనా ఊపిరాడనివ్వని పనుల్తో సర్వావయవాలూ నిస్సారంచేస్తూ, నిరాశా నిస్పృహల్లో ముంచుతూ, జుగుప్సాకరమైన పురుషుడి ఆధీనతలో అమానుషంగా, అనాగరికంగా, అణచి ఉంచబడుతుంది. స్త్రీ ఒంటరిగా బిడ్డల పెంపకానికి అలసి, విసిగి వ్యక్తిగతమైన విరక్తిలో మునిగి, మాతృత్వాన్నే ఏవగించి, నిర్లక్ష్య పర్చుకునే దయనీయమైన స్థితికి చేరుతుంది.

ఈ 'ఇంటి చాకిరీ' సంకెళ్ళ నుంచి బయటపడనప్పుడు స్త్రీకి విముక్తి సాధ్యం కాదని బోల్షివిక్ పార్టీ గుర్తించింది. శ్రామిక వర్గ నాయకత్వంలో, స్త్రీలని బంధించే 'ఇంటి చాకిరీ'కి వ్యతిరేకంగా అన్ని కోణాల నుంచి పోరాటం సాగినప్పుడే స్త్రీలకు నిజమైన విముక్తి ప్రారంభమవుతుంది. స్త్రీలు సంపూర్ణంగా విమోచనం చెందాలంటే, సమాజంలో స్త్రీ పురుషులు ఒకరకమైన సమాన స్థాయిలో బ్రతకాలంటే— 'ఇంటి పనులన్నీ' సమాజపరం చేసి తీరాలి (socialisation). సామాజిక ఉత్పత్తికి అవసరమైన శ్రమలో స్త్రీలు తప్పనిసరిగా భాగం పంచుకునే పరిస్థితి ఏర్పడాలి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఒక్కొక్క ఇంట్లో వేరువేరుగా జరిగే ఇంటి పనంతా ఒక "భారీ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ" (Large-scale socialist economy) గా మొత్తంగా మార్చినప్పుడు (Wholesale transformation) స్త్రీల విముక్తి సాధ్యమవుతుంది.

గొప్ప సోషలిస్టు సమాజ నిర్మాణం జరగాలంటే అన్ని రంగాల్లోనూ అత్యధికంగా ఉత్పత్తి జరగాలి. దానికోసం, సమాజంలో ప్రతి ఒక్కరూ శ్రమచెయ్యాలి.

స్త్రీల శ్రమంతా ఎందుకూ పనికిరాని, విలువలేని, చిల్లరపనుల్లో వ్యర్థమై ధ్వంసమై పోతోంది. ఆ శ్రమే సామాజిక ఉత్పత్తి కార్యాల్లో జరిగితే సోషలిస్టు సమాజం అత్యధిక బలంతో స్థిరపడుతుంది.

వంట, భోజనం, పిల్లల పెంపకం, చదువు మొదలైన పనులు ఎవరికివారు వ్యక్తిగత కుటుంబాలలో చేసుకోవడానికి బదులుగా— సమాజంలో సమిష్టిగా జరిగే కార్యాలుగా, విధులుగా మార్చడానికి మా 'శ్రామిక పరిపాలన' హృదయపూర్వకంగా చిత్తశుద్ధితో ప్రయత్నాలు చేస్తోంది. సమిష్టి వంటశాలలు (Community kitchens) పబ్లిక్ భోజనశాలలు (Public dining halls), బట్టలుతికేందుకు Laundries, తల్లి పనికి వెళ్ళినప్పుడు పసిపిల్లల్ని చూసే నర్సరీలు (క్రెచెస్), ఎడపిల్లల కోసం కిండర్ గార్టెన్స్, పెద్దపిల్లల కోసం చిల్డ్రన్స్ హోమ్స్, విద్యా సంస్థలు మొదలైన సంస్థలు సమిష్టిగా నడుపుతున్నది. మొత్తం దేశ అవసరాలు దృష్టిలో పెట్టుకుని చూస్తే ఇవి చాలా తక్కువ. (ఇవి 1919 లో చెప్పిన మాటలు. శ్రామికవర్గం అధికారంలోకి వచ్చిన రెండు సంవత్సరాలకి)- ఇంకా ఎన్నో వేలరెట్లు అధికంగా చెయ్యవలసివుంది,

మా ప్రభుత్వం కొత్తగా చేసిన చట్టాలలో స్త్రీ పురుషుల మధ్య ఏ అసమానతలూ లేవు. ఇవి బూర్జువా చట్టాల మల్లే కాయితాల మీద మాత్రమే మిగిలిపోయే చట్టాలు కావు. వాటిలో ప్రతి అక్షరమూ కార్మిక ప్రభుత్వం దృఢచిత్తంతో అమలు జరుపుతుంది.

"శ్రమ చేయడంలో స్త్రీ పురుషుల సమానత్వం" అంటే శారీరక పరిస్థితుల్నీ, స్త్రీల ఆరోగ్యాన్నీ గమనించకుండా, గర్భిణులైన స్త్రీలూ బాలెంతలైన స్త్రీలూ అన్ని వేళలా అన్ని పనులూ పురుషులతో సమానంగానే చెయ్యాలని అర్థం కాదు.

సాంఘిక రంగంలో కూడా స్త్రీ పురుషుల్లో వెనకబడ్డ భావాన్ని తొలగించడానికీ, పాత, సంకుచిత దోపిడీ వ్యవస్థల సంస్కృతిని అంటిపెట్టుకున్న మనస్తత్వాన్ని (non-communist Psychology ని) పెకిలించివెయ్యడానికీ మా ప్రభుత్వం ప్రతిఒక్క ప్రయత్నమూ చేస్తోంది.

స్త్రీల విముక్తి కోసం చేసే ఈ ప్రయత్నాలన్నీ ఇంకా మొట్టమొదటి అడుగు మాత్రమే. ఈ కార్యం ఇంకా అనేక సంవత్సరాల కాలం పడుతుంది.

ఈనాటి పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని చూసినా, బూర్జువా దేశాల స్త్రీల స్థానంతో పోల్చినప్పుడు రష్యాలో స్త్రీల స్థాయి ఎంతో ఉన్నతంగా, ఆదర్శనీయంగా వున్నదని మేము సగర్వంగా చెప్పుకోవచ్చు.

రంగనాయకమ్మగారు "ఇంటి చాకిరీ ఏ రకం దోపిడీ? అది ఎలా అంత మిపుతుంది?" అనే వ్యాసంలో చివర యిలా రాసారు :

సోషలిస్టు సమాజంలో అన్ని రంగాలలోనూ ఆర్థిక రంగంలో, రాజకీయ రంగంలో, విద్యారంగంలో, మిలిటరీ రంగంలో సమస్తమైన కార్యకలాపాలూ, నిర్వహిస్తున్న స్త్రీని 'ఇల్లాలు', 'గృహిణి', 'మానిని', 'గినిని' అనకూడదు. అవి పాత వ్యవస్థలకు సంబంధించిన మాటలు. వాటి అర్థాలు వేరు. వాటి కర్తవ్యాలు వేరు.

అలాగే సోషలిస్టు సమాజంలో ఇంటి పని "చాకిరీ"గా కూడా వుండదు. అనేక పనులు విద్యుత్తు ద్వారా, మిషన్లద్వారా జరుగుతాయి. అవి ప్రతి ఒక్కరికీ అందుబాటులో వుంటాయి. ఆ పనులు చేయడమైనా స్త్రీకి సంబంధించిన వ్యవహారం అని పురుషుడు అనుకోడు. ఇంటికీ, పిల్లలకూ సంబంధించిన ప్రతి పనినీ స్నేహంతో, బాధ్యతతో ఇద్దరూ పంచుకుంటారు. అదే ఆదర్శవంతమైన సహజీవనం అని భావించే సాంఘిక చైతన్యం ఏర్పడుతుంది వారికి. అలా జరుగుతోందనే విషయం మనం చదువుతోనే వున్నాం. సోషలిస్టు దేశాలు పర్యటించి వచ్చిన ద్వారా వింటోనేవున్నాం.

మనస్తత్వాలు మారనివీ పెరగనివీ కావు. ఏ వ్యవస్థలో ఆ మనస్తత్వమే ఏర్పడుతుంది. అదే స్థితిని బట్టి చైతన్యం లేకపోతే మనం "బానిస సమాజం"లోనే వుండేవాళ్ళం.

---

స్త్రీకి కూడా శరీరం వుంది; దానికి వ్యాయామం యివ్వాలి-
ఆమెకి మెదడు వుంది; దానికి జ్ఞానం యివ్వాలి-
ఆమెకి హృదయం వుంది; దానికి అనుభవం యివ్వాలి.

— చలం

---

## పాఠకులకు గమనిక

సృజన తీవ్రమైన ఆర్థిక ఇబ్బందుల నెదుర్కొంటున్నది. చాలా మంది ఏజెంట్లు సక్రమంగా డబ్బు చెల్లించడంలేదు. బకాయిపడ్డ ఏజెంట్లకు జనవరి '80 సంచిక నుంచి సృజన పంపబడదు- కనుక పాఠకులందర్నీ చందాదారులుగా చేరవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

'సృజన'

హనుమకొండ, వరంగల్ 506 001

# గతంలో స్త్రీ

భారత సమాజంలో శూద్రులను నిమ్న జాతులను హీనమైన స్థితిలో వుంచడమే గాక స్త్రీలను అబలలుగా పరాధీనులుగా ఉంచడానికి పాలక వర్గాలు కఠినమైన చర్యలు తీసుకొంటూ వచ్చాయి. సమాజంలో కుటుంబంలో పురుషాధిక్యతను నెరవుటకు స్త్రీజాతిపై సాగిన పీడన అకృత్యాలు దేనికీ తీసిపోవు. సమాజంలో విభజన అనేది స్త్రీ పురుషులమధ్య శ్రమ విభజన తోటే ప్రారంభం. ఆస్తిహక్కులతోటే సమాజం తోపాటు కుటుంబంలో అసమానతలు ప్రారంభం. పితృస్వామిక దశలో ఉన్న ఆర్యజాతులకు మాతృస్వామిక దశలో ఉన్న అనార్య జాతులకు మధ్య సాగిన యుద్ధాల ఫలితంగానే ఆర్యజాతులు అనార్య జాతులను వారి స్త్రీలను దాస దాసీలుగా చేసుకొని బానిస గ్రామీణ వ్యవస్థను నెలకొల్పాయి. ఈ వ్యవస్థలో అగ్రవర్ణ స్త్రీలతో సహా స్త్రీలంతా బానిసలే. స్త్రీలకు ఆస్తిహక్కు లేదు. సంతానాన్ని కనడం వారిని పెంచడం భర్తకు అత్తమామలకు సేవ చేయడం కుటుంబచాకిరీ స్త్రీల బాధ్యత. అగ్రవర్ణ స్త్రీలకు అదనంగా లభ్యమయ్యేది దాస దాసీ జనంపై పెత్తనం. పురుషుని విలాస వస్తువుగా వుండి అవసరమైన గుడ్డలు సుగంధ ద్రవ్యాలు కోరుకోవాలే తప్ప సమాజ వ్యవహారాలలో కుటుంబ వ్యవహారాలలో వారి అభిప్రాయాలకు తావులేదు. పురుషుని అలంకారం గానే స్త్రీయొక్క స్థానము. భర్తపై ఆధార పడ్డది కాబట్టే భార్య, పతియే వ్రతముగా కలది కాబట్టే పతివ్రత. పురుషులకు సతీవ్రతమనే నియమము లేదు. స్త్రీలపై ఆధారపడ్డ వికలాంగులు కూడ భర్తలే. స్త్రీకి భర్తయే సర్వస్వము.

అవి బానిస ఫ్యూడల్ వ్యవస్థల నీతి. ఈ నీతిని ఆమోదించి అక్షరాల అమలు జరిపిన స్త్రీలను ఆదర్శ మహిళలుగా చిత్రించారు. సీత, సావిత్రి అంతా యిట్టి ఆదర్శ మహిళలే. రుద్రమదేవి పురుష వేషము వేస్తేనే తప్ప కాకతీయ సామ్రాజ్యమును పరిపాలించలేక పోయింది. ప్రాథమికమైన వ్యవసాయక దశలో మాతృస్వామిక దశలో ఉన్న అనార్యజాతులు పరాజయాన్ని పొంది శూద్రులుగా పంచములుగా గ్రామీణ వ్యవస్థలో పురుషాధిక్యత నెరపే ఆర్య సంప్రదాయాలకు లోనై నప్పటికీ వారి కుటుంబాలలో స్త్రీల స్థానము అంతహీనముగాలేదు. ఇందుకు రెండు కారణాలున్నాయి. మొదట స్త్రీలు కూడ వ్యవసాయ తదితర వృత్తులలో భాగస్వాములు కావడం. ఫ్యూడల్ వ్యవస్థలో స్త్రీల ఆర్థిక కృషి మరింత పెరిగింది. పురుషులు త్రాగుడు తదితర దుర్వ్యసనాలకు పురుష దురహంకారానికి లోనై దుర్వ్యయం, దుర్మార్గం, హింసలకు పూనుకున్నపుడు స్త్రీలు తమ కష్టార్జితంలో తమ

బిడ్డ పాపలను పోషించుకోవడము దుర్మార్గుడైన భర్తను వదిలి పునర్వివాహం చేసుకోవడం నిమ్నజాతుల్లో శూద్రకులాల్లో సాంప్రదాయం. తమ కష్టార్జితం మీద వీరు ఆధారపడగల పరిస్థితే యిందుకు కారణం. అనాదిగా స్త్రీ ప్రాధాన్యత గల పూర్వ సంప్రదాయం యీ వర్గాలకు సంక్రమించడం రెండవ కారణం. అగ్రవర్ణాలు పురుషుని దేవునిగా చేసుకొని కొలుస్తూవుంటే, యీ వర్ణాలు స్త్రీలను ప్రధానంగా దేవతలుగా చేసుకొని పూజించడం సాంప్రదాయం. వ్యవసాయానికి సంబంధించిన వ్రతాలు గౌరీపూజలు శక్తిపూజలు అనార్య జాతుల నుండి వచ్చిన సాంప్రదాయం. ఈ సాంప్రదాయం అగ్రవర్ణాల స్త్రీలను కూడా ప్రభావితము చేస్తూవచ్చింది. భారత దేశాన్ని భారత మాతగా భావించడము యీ సంప్రదాయ భావము. అది నినాదము మాత్రమే. కాని ఆచరణలో పురుషాధిక్యత అగ్రవర్ణాధిక్యత కొనసాగుతూనే ఉంది. దీన్ని ఆమోదించి ఈ ఆధిక్యతను నెరపే స్త్రీల నాయకత్వాన్ని మన్నించుటకు వర్గ సమాజానికి అభ్యంతరం లేదు. భారత దేశములో ఆదిమ జాతులకు వర్గ సమాజానికి మధ్య సంఘర్షణ సాగుతున్నట్లే పితృస్వామిక సంస్కృతికీ మాతృస్వామిక సంస్కృతికీ మధ్య ఘర్షణ సాగుతూనే వచ్చింది. శూద్రులను, నిమ్నజాతులతోపాటు స్త్రీలను అణచి వుంచడం వారిని విద్యా విజ్ఞానాలకు దూరం చెయ్యడం సమాజములో వారి స్థానం హీనంగా వుండేటట్లు చూడటం వర్గ సమాజ ధర్మాలైనాయి.

ఇంద్రుడు పర స్త్రీలతో సాగించే విలాసాలు స్తుతింప దగ్గవని ఋగ్వేదము వ్యక్తము చేసింది. (1వ మండలం, 10వ అనువాకం, 51వ సూక్తం, పేజి 136) ఇంద్రుడు ముని పత్నులతోసహా స్త్రీలను వంచించి వశం చేసుకోవడాన్ని పురాతన సాహిత్యం అభివర్ణించింది. స్త్రీ జాతిని స్త్రీల చేతనే అవహేళన చేయించడాన్ని పురుషుని అందల మెక్కించడాన్ని ఫ్యూడల్ సాహిత్యము ఒక కళగా అభివృద్ధి చేసింది. సతికి పతియే సర్వస్వమనీ దైవమనీ రామాయణం ప్రబోధించింది. భర్త యెట్టి వాడైనా భార్య అతని మాట దాటరాదనీ శాస్త్రాలు ఇతిహాసాలు ఘోషించాయి. "దోషంబులకెల్ల మూలం వనితల"నీ అన్య పురుషులను పొందచూడటం స్త్రీ స్వభావమనీ స్త్రీ చేసేదంతా పురుషుని పొందుకొరకేనని, భారతంలో పంచ చూడా అనే స్త్రీకి నారదునికు మధ్య జరిగిన సంవాదము వ్యక్తము చేస్తుంది. (అనుశాసనిక పర్వం పేజీ 53, 54) స్త్రీ ఎప్పుడూ పరాధీనగానే వుండాలని తల్లిదండ్రులో, సోదరుడో, మామయో ఆమెను యోగ్య వరుని చూచి యివ్వాలనీ, "పతికి సనువ్రతగా యుండుట గృహిణి ధర్మము"ని పార్వతి శివునితో చెపుతుంది. (అనుశాసనిక పర్వం పేజి 180, 181)

భర్త శుశ్రూష అత్తగారి సేవ చేస్తూ "వనిత భర్తభావమెరిగి చరించి ఆయన అభిమానాన్ని చూరగొనాలని" ద్రౌపది సత్యభామకు ప్రబోధిస్తుంది. (అరణ్య పర్వము పేజీ 222, 223) భర్తయే దైవమని యీవిధంగా స్త్రీజాతికి బానిసత్వాన్నే ధ్యేయంగాపెట్టిన సాహిత్యం ప్రపంచంలో మరియొకటి వుండబోదు. ఈ అభివృద్ధినిరోధక సాహిత్యం యొక్క విషప్రభావము అగ్రవర్ణ స్త్రీలపైన సమాజముపైన పెద్దగా ఉంది. మరణించిన భర్తతో భార్య సహగమనం చేయడం బాలికలతోసహా వితంతువులను తలలు గొరిగించి పునర్వివాహం లేకుండా పుంచడం మొదలగు ఫ్యూడల్ దురాచారాలు బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలకు ఆచారాలుగా కొనసాగాయి. ఈ దురాచారాలనే వేమన "తలలు బోడులైన తలపులు బోడులే" అని అవహేళన చేశాడు. పాశ్చాత్య నాగరికత ఫలితంగా అగ్రవర్ణాలవారు తమలో వ్యాపించియున్న యీ దురాచారాలను సంస్కరించుటకు కృషిచేశారు. రాజారామ మనోహరరాయి, కందుకూరు వీరేశలింగం మొదలగువారి కృషి యీ సందర్భంలో చెప్పదగ్గది. కాని వీరు యిదే ప్రధానమని భావించి యిందుకు దేశ బానిసత్వానికి మూలమైన బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పంచ చేరారు. ఉన్నత వర్గాల నుంచి వచ్చిన స్త్రీలు కొందరు గాంధీ నెహ్రూ మొదలగు నాయకుల అధిపత్యాన పని చేశారు. వారి ఆశయమంతా తమ నాయకుల లాగానే ఆధిపత్యాన్ని నెరపడం. అది బడాబూర్జువా బడాభూస్వామ్య ఆధిపత్యాన్ని నెరపడమే. నిమ్న జాతులకు శూద్ర కులాలకు చెందిన స్త్రీలు మాత్రము ఫ్యూడల్ వ్యతిరేక సామ్రాజ్య వ్యతిరేక పోరాటాలలో పురుషులతో భుజం కలిపి వీరోచితంగా పోరాడారు. గొప్ప త్యాగాలు చేశారు. కార్మిక సమ్మెల్లో రైతు పోరాటాలలో పురుషులకంటె స్త్రీలు పట్టుదలను పోరాట తత్వాన్ని పోరాటంయెడ మమేకతను ప్రదర్శించారని ప్రవీణుల పరిశీలనవల్ల స్పష్టమవుతుంది. ఈ మహిళలలో నాయకత్వం కోసము పెనుగులాట నేది మచ్చుకు కూడ కనపడదు. అంటరాని కులాలకు, వృత్తిదార్ల కులాలకు చెందిన స్త్రీలు నిరంతరం భూస్వాముల దుర్మార్గాలకు అవమానాలకు మానభంగాలకు గురవుతూ అనేక రీతుల ప్రతిఘటనను సాగిస్తున్నారు. అర్థవలస అర్థఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకముగా సాగే పోరాటంలో వీరొక పెద్దశక్తి. ఈ వ్యవస్థ అంతమైతే తప్ప మహిళలకు వీటి నుండి విముక్తి లేదు.

(పార్వతీపురం కుట్రకేసులో కామ్రేడ్స్ కొల్లా వెంకయ్య, నాగభూషణ్
పట్నాయక్ తదితరులు చేసిన సిద్ధాంత ప్రకటన నుండి.
ముందుబాట ప్రచురణలు: జూన్ 77, పే. 28-31)

# వరకట్నం మంటల్లో ....

'కట్నంగా నేను ఫ్యాను తేనందుకో, గడియారం తేనందుకో కాల్చివేయబడతాను, విషమిచ్చి చంపబడతాను'.

పందొమ్మిది సంవత్సరాల బంవాటి జూన్ చివరి వారంలో హత్యచేయబడక ముందు రాసిన ఉత్తరంలోని మాటలివి. నిజంగానే ఆమె జూన్ 28న విష ప్రయోగం వల్ల చనిపోయింది.

అదే సమయానికి యుపిఎస్‌సిలో స్టెనోగ్రాఫర్ కంచన్‌చోప్రా ఒకానొక ఢిల్లీ ఆస్పత్రిలో బతుకు కోసం పోరాడుతున్నది. జూన్ ఇరవైఏడున ఆమె తల్లి దగ్గరకొచ్చి కట్నంలో స్కూటర్ ఇవ్వనందుకు బాధిస్తున్నారని, ఇక అక్కడికి పోనని చెప్పింది. కొంతసేపటికి భర్త వచ్చి ఆమెను తీసుకపోయాడు. ఆ రాత్రి మూడు గంటలకు కంచన్ ఇంటి పక్కవాళ్ళు వచ్చి కంచన్ కాలిపోయిందని, ఆస్పత్రిలో చివరి క్షణాలు గడుపుతున్నదని తెలిపారు.

కొద్దిరోజులకు ముందే జూన్ పన్నెండున తస్వీర్ కౌర్ కాలి చనిపోయింది.

ఆరునెలల గర్భిణి శశిబాల కాలి చనిపోయింది.

జహంగీర్ పురిలో ఒక యువతి కట్నం తేనందుగ్గాను పన్నెండు కత్తిపోట్లుతిన్నది.

ఇంకా భిలాయి వీణాకుమారి, కాన్పూరు మాధురి, సరళ....... ఇంకా ఎందరో.

1978లో కట్నంకోసం హత్యచేయబడ్డ యువతుల సంఖ్య - లెక్కలేనన్ని నమోదుకాని కేసులు, ప్రయత్నించిన కేసులు కాక– 248. కాగా 1979 జూలైనెల లోనే ఒక్క బటిండా జిల్లాలోనే ఇలాంటి హత్యలు 34 నమోదయ్యాయి.

తగలబడి చనిపోతే ఏ సాక్ష్యాలూ మిగలవు, కోడలు ఎక్కువ కాలం వంటింట్లోనే వుంటుంది. కాబట్టి ఏదో ప్రమాదమని చెప్పొచ్చు. ఈ కారణాలు మంటలను 'మెట్టినింటివాళ్ళ' చేతులో అత్యంత శక్తివంతమైన మారణాయుధాలుగా మార్చినయి.

అంతర్జాతీయ మహిళా దశాబ్దంలో మహిళలు తమ విముక్తికి మంటలు తప్ప వేరే మార్గం లేదని అనుకోవడం వెనక వున్నదేమిటి? ఈ కష్టాలను తొలగించడానికి మనమేమీ చేయలేమా?

పెద్దపల్లి సంఘటన :

## 'పశు సంతతి పాలన ఇది'

'రాజ్యం స్త్రీల పట్ల, వాళ్ళు స్త్రీలైనందువల్ల, ఎటువంటి భేదము చూపదు' అని భారత 'ప్రజాస్వామ్య, లౌకిక' రాజ్యాంగం అంటున్నది. 'ఈ అధికరణం స్త్రీలకు ప్రత్యేక సదుపాయాలు(?) కల్పించే విషయంలో రాజ్యానికి అడ్డురాదు' అనీ చెపుతున్నది.

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ తన 376 సెక్షన్‌కింద 'రేప్ చేసిన వ్యక్తి ఎవరైనప్పటికీ ఆ వ్యక్తికి యావజ్జీవ కారాగార శిక్ష విధించ బడుతుంది లేదా పదిసంవత్సరాల జైలుశిక్ష విధించబడవచ్చు' అని రాసుకున్నది.

ఐతే మన అమానుష ధర్మశాస్త్రాలూ భారత ప్రభుత్వ యంత్రాంగము ఏం చెపుతున్నాయి ?

'స్త్రీ తన అందం గురించి శ్రద్ధ తీసుకోగూడదు. అది పురుషుడికి మాత్రమే హక్కు' 'స్త్రీ స్వాతంత్ర్యానికి అర్హురాలు కాదు' అని మనుధర్మ శాస్త్రం అంటున్నది.

'స్త్రీల పట్ల, స్త్రీలపై భూస్వాములకు, పోలీసులకు, ధనవంతులకు అన్ని అధికారాలూ వున్నాయి'. ఇది ప్రభుత్వ యంత్రాంగ స్వభావం.

'ఎవరైనప్పటికీ' అని క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ఘోషిస్తున్నప్పటికీ ఎన్నో వందల, వేల రేప్‌కేసులు కాలగర్భంలో కలిసిపోయాయి.

శీలాన్ని ఒక సంపదగా, కోల్పోవడం స్త్రీ తప్పు మాత్రమే ఐనట్టుగా, భావించే మనస్తత్వం మనరక్తంలో వున్నది. ఇలాంటి భ్రమాజనిత విలువలున్న సమాజంలో రేప్ చేయబడినప్పటికీ 'వీడు రేప్ చేశాడు' అని స్త్రీ ధైర్యంగా ముందుకు రాలేకపోతున్నది. అలా వచ్చినా అది పురుషుడి గర్వ కారణంగానే మిగులుతున్నది గాని వాణ్ణి ఎవడూ నీచంగా చూడడం లేదు.

ఈ పరిస్థితిలో వేల రేప్ కేసుల్లో ఒకటి రెండే వెలుగులోకి రావడం సహజమే.

సంవత్సరంన్నర దాటిపోయింది, రమీజాబీని పోలీసులు చెరిచి, తర్వాత ఆమెపై తప్పుడు కేసుపెట్టి- నామ మాత్రపు శిక్షలే తప్ప నేరస్తులెవరికీ శిక్షలు పడ లేదు. పడతాయని అనుకోవడమూ అవివేకమే. 'నరహంతలు ధరాధిపతులై' వున్నచోట హంతకులకు శిక్షలెట్లాపడతాయి? వ్యవస్థ మారేదాకా వాళ్ళకు శిక్షలూ పడవు, వాళ్ళ అత్యాచారాలూ తగ్గవు.

నూతన వ్యవస్థ వాళ్ళని ఉరితీసేందుకు, వాళ్ళేగొలుసులు తయారుచేసుకుంటున్నారు. ఆ గొలుసులో ఒక లింకు పెద్దపల్లి సంఘటన.

అది (దుర్మార్గులకు) కోరికలు సిద్ధించే సిద్ధార్థి సంవత్సరం. మండుటెండల వర్షరుతువు- సెప్టెంబర్ డెబ్బైతొమ్మిది. మూడోతేదీ సాయంత్రం నాగపూర్ ప్యాసింజర్ అందుకోవడానికి ఆదిలాబాద్‌జిల్లా సిర్పూర్ తాలూకాలోని పెల్లి గ్రామం నుంచి ఒక యువతి, ఒక వృద్ధుడు పెద్దపల్లి రైల్వేస్టేషన్ కొచ్చారు. వాళ్ళొచ్చేసరికి నాగపూర్

ప్యాసింజర్ వెళ్ళిపోయింది. పెద్దపల్లిలో వాళ్ళకు తెల్సిన వాళ్ళెవరూలేరు. ఆ యువతి పదిహేడు వత్సరాల పడుచు జిజియాబాయి, ఆ వృద్ధుడు ఆమె మామ పోడేటి గౌరయ్య.

"సర్వసత్తాక గణతంత్ర లౌకిక ప్రజాస్వామిక" భారతదేశంలో ఏస్థలంలోనైనా భద్రత వుంటుందని భావించడమే వాళ్ళనేరం. వాళ్ళు ఆ నేరం చేసారు. తెల్లవారి రైల్లో పోదామనుకొని ఆ రాత్రి స్టేషన్లో పడుకున్నారు.

'రక్షకభటుల' ముఖ్య బాధ్యత రాత్రిళ్ళు ప్రజలకు దొంగలనుండి రక్షణఇవ్వ డం కాబట్టి (ఇది ప్రజలకు రక్షణో ! దొంగలకు వ్యభిచారులకు రక్షణో !) బస్‌స్టాండ్ లలోనూ, బజార్లలోనూ, రైల్వేస్టేషన్‌లోనూ పడుకున్న జనాన్ని 'రక్షించి' వాళ్ళ దగ్గర వున్నదేదో గుంజుకుంటారు.

ఆ విధంగానే ఖయ్యూం అనే కానిస్టేబుల్ డ్యూటీలేకున్నా ఆరోజు అర్ధరాత్రి రైల్వేస్టేషన్‌లోకి వచ్చాడు. అక్కడ నిద్రపోతున్న శ్రీమతి జిజియాబాయిపై వాడి కళ్ళు పడ్డాయి. ఆమెను, ఆమె మామను లేపి, బెదిరించి రిక్షాలో ఎక్కించాడు. స్టేషన్‌కు చాలా దూరంగా ఒక నిర్మానుష్యస్థలానికి వాళ్ళను తీసుకుపోయాడు. అక్కడ శ్రీమతి జిజియాబాయిని ఆ నీచుడు చెరిచాడు. ఆ తర్వాత శ్రీ గౌరయ్యను చితకబాది ఆయన దగ్గరవున్న పద్నాలుగు రూపాయలు గుంజుకొని రిక్షాకు నాలుగురూపాయ లిచ్చాడు. వీళ్ళను మళ్ళీ స్టేషనుకు పంపుతూ ఈ విషయం ఎక్కడా తెలియనీయొద్దని బెదిరించాడు.

ఈ వార్త తెలిసిన రాడికల్ విద్యార్థి యువజనులు చాలామంది స్టేషన్‌లో జమ అయ్యారు. ఎస్.ఐ.ని స్టేషన్‌కు రమ్మని ఫోన్‌చేశారు. వస్తానని చెప్పి రానే లేదాయన. సి ఐ. కూడా అట్లాగే రాలేదు. ప్రజల భద్రత, రక్షణ. విషయంలో ప్రభుత్వ యంత్రాంగానికి ఎలాంటి స్వభావం వుందో దీనితో అర్థం చేసుకోవచ్చు. తర్వాత కొంతసేపటికి స్థానికప్రజలు రాడికల్ విద్యార్థి యువజనులు జిజియాబాయిని తీసుకొని ఊరేగింపుగా ఆర్‌డివో కార్యాలయానికి వెళ్ళారు. ఈ విషయమై పెద్దపల్లిలో సెప్టెంబర్ నాలుగున, ఐదున స్వచ్ఛందంగా బంద్ జరిగింది.

ఈ ఆందోళన ఫలితంగా జిజియాబాయిని కరీంనగర్ పౌరఆస్పత్రికి పంపారు. ఖయ్యూంని సస్పెండ్ చేశారు.

రద్దయిన లోక్‌సభ సభ్యుడు వి. తులసీరాం సెప్టెంబర్ ఎనిమిదిన ఒక ప్రకటనలో ఈ సంఘటనపై మెజిస్ట్రేట్ విచారణ జరగాలని కోరాడు.

అత్యాచారం, మానభంగం చేయబడలేదని మామూలుగానే డాక్టరుతో రిపోర్ట్‌యిప్పించారు పోలీసులు.

ఈ వార్త పత్రికకు పంపించినందుకు ఆంధ్రప్రభ విలేఖరి శ్రీ ఎం.ఎ. రహీం ను స్థానిక ఎస్. ఐ. పోలీసు స్టేషన్‌కి పిలిపించి తిట్టి, బాగా కొట్టాడు.

ఉదయ కిరణాలు :

# రేపటి నేతలు

జుగాష్విలి

చిట్టిపొట్టిబాబుల్లారా
గులాబిరేకుల పాపల్లారా
చాచానెహ్రూ మనకొద్దు
ఛీఛీ బ్రతుకులు అసలొద్దు
కొత్తగపాఠాల్ నేర్వాలీ
కొత్తగఅడుగులు వేయాలీ ॥చిట్టిపొట్టి॥

పల్లెటూరిలో పోశిగాడు
పెద్దరెడ్డికి జీతగాడు
గొడ్లగాసి పెండలెత్తి
కసువుచిమ్మి పడకలెత్తి
గొడ్డుశాకిరి జేసినేమి
కాలేకడుపుకు తిండేది
ఏడ్చేకన్నుకు తుడుపేది ॥చిట్టిపొట్టి॥

పచ్చనిచేలలో పోశమ్మా
పసిపాపమ్మా చూడమ్మా
కలుపులుతీసి, నాటులునాటి
చెమటలుకారి, చేతులుకంది
గొడ్డుశాకిరి జేసినేమి
కాలేకడుపుకు తిండేది
ఏడ్చేకన్నుకు తుడుపేది ॥చిట్టిపొట్టి॥

పట్నంలో పోశయ్యా
రిక్షాతొక్కే బాబయ్యా
కిరాయికట్టి, లంచంబెట్టి
నరాలులాగి, నెత్తురుకక్కి
గొడ్డుశాకిరి జేసినేమి
కాలేకడుపుకు తిండేది
ఏడ్చేకన్నుకు తుడుపేది ॥చిట్టిపొట్టి॥

పెద్దింట్లో పనిపిల్లమ్మా
పసిపాపా పుత్తడిబొమ్మా
అంట్లుతోమి, యిల్లుతుడిచి
పిల్లనెత్తి, బట్టలుతికీ
గొడ్డుచాకిరి జేసినేమి
కాలేకడుపుకు తిండేది
ఏడ్చేకన్నుకు తుడుపేది ॥చిట్టిపొట్టి॥

రేపటినేతలు మీరంతా
బానిసబతుకులు చాలింకా
చాచానెహ్రూ మనకొద్దు
ఛీఛీ బ్రతుకులు అసలొద్దు
కొత్తగపాఠాల్ నేర్వాలి
కొత్తగఅడుగులు వేయాలి
చల్లనిరాజ్యం తేవాలి
చక్కనిరాజ్యం తేవాలి ॥రేపటి॥

---

## మా అక్షరాలు

హెచ్చార్కె

మా అక్షరాలు ఆకాశ పారిజాతాలు కాదు
మా అక్షరాలు కన్నీళ్లు తుడుచుకునే
కర్చీఫ్ ముక్కలు కాదు
మా అక్షరాలు ప్రభువుల పాదపీఠాలు
తుడిచే తలనీలాలు కాదు
మా అక్షరాలు ప్రయోగశాలలో
వధింపబడే గినీపిగ్స్ కాదు
వెన్నెట్లో ఆడుకోడానికి వాటికి తీరికలేదు
బంగారు రంగు అట్టలు కప్పుకుని
నిద్దరోవాలని వాటికి కోరికలేదు

ఎదురొమ్ము మీద ప్రపంచాన్ని మోస్తూ,
నెత్తుటి పిడికిళ్ళతో దాన్ని మారుస్తూ,
నడుస్తున్న కార్మిక, కర్షకయోధులతో
కదం కలంకలిపి నడుస్తున్న సహవీరులు;
మా అక్షరాలు
సుత్తెలు, కొడవళ్లు, రక్తవర్ణపతాకాలు.

---

## కొత్త అల

జూకంటి జగన్నాథం

కళ్ళు
భగభగ లాడుతున్న
నిప్పు కణికలు-
మెదడులో
అగ్ని పర్వతాల సంచలనం-
కదం తొక్కుతున్న తుఫానులు

గుండెలో
ఎగసిపడుతున్న నెత్తుటి కెరటాలు
ఎత్తిన చేతులు
ప్రశ్నల కొడవళ్లు-
ఈ లేచిన గంభీరమైన కొత్త అల
శ్రమజీవి కలకు ఊపిరి-

---

## మాకేం తక్కువ?

శంకర్

మాకేం తక్కువండీ?
ఆకాశయానం నుంచి అణుబాంబు దాక
అన్నీ మా వేదాల్లోనే ఉన్నాయి!
పైథాగరస్ థీరాన్ని
మా యజ్ఞవాటికల్లో యుగాల నుంచీ
ముగ్గులుగా వేసుకుంటూనే ఉన్నాం!
నీటిని పెట్రోలుగా మార్చే
బాబాల బలం మా కండగా వుంటే
అరబ్బుల ఆయిల్ బాంబు
మమ్మల్నేం చేస్తుంది?

ఏదో పదిమందికి
ఉపాధి కల్పించాలనే తాపత్రయమే గాని
సీకో వాచీలనే గాలిలో సృష్టించే
దైవాంశ సంభూతులుండగా
హెచ్ ఎం టి పరిశ్రమకు శ్రమ
ఎందుకు?
అంతెందుకు, సార్!
నిన్నటికి నిన్న
స్కైలాబ్ దారి మార్చేందుకు
సహస్రనామార్చన చేయలేదూ?!



# తుఫాను

నవల - సీరియల్

చౌ లి-పో

ఇంగ్లీషు నుంచి తెలుగు

నళిని

రెండవ భాగం

(గత సంచిక తరువాయి)

## 6

పేదరైతుల, కంబారుల లీగ్‌లో ఆడవాళ్ళని కూడా కలుపుకున్నారు. చిన్నమీ ముఠానడిపిన మహిళాసంఘం ఇప్పుడు దాదాపు మూతబడినట్లే. చిన్నమీకి బయటకు వచ్చే ధైర్యంలేక ఇంట్లోనే వుండి కట్టెలు కొట్టడం, బట్టలకు మాసికలు వెయ్యడం, చెప్పులుకుట్టడంలాంటి పనులు చేయసాగింది. పెనిమిటి దగ్గర పతివ్రతలా నటించ సాగింది. ఆ పిచ్చిమొగుడు ఇదంతా నమ్మేసి ఊరందరితోను తన భార్య మంచికి మారిందని చెప్పుకునేవాడు.

రైతుసంఘం ఆఫీసులో రెండుగదుల మధ్య అడ్డం తీసేసి పేదరైతులు కంబారులు సమావేశమయేవారు. మధ్య తరగతి రైతులతో ఎలా మెలగాలో సియావో చాలాసార్లు వివరించేడు. భోజన సమయాల్లో తప్ప ఎప్పుడూ ఈ గది కిటకిటలాడి పోయేది. గది మధ్యలో ఎండుపుల్లల మంట వుండేది. రాత్రులు నాలుగువత్తుల లాంతరు దూలానికి వేలాడేది. మంటచుట్టూ కూర్చుని రైతులు చుట్టలు కాల్చుకుంటూ చర్చించుకునేవారు. ఆ గది ఎప్పుడూ చుట్టలకంపు కొట్టేది. అయిదు రోజుల నుంచి సమావేశం సాగుతూనే వుంది. చూసి చూసి 'చు'కి విసుగెత్తి,

"ఇక కబుర్లుకాన. బుగతలంతా రాచ్చసులే. మనం మాటలు సాలిచ్చి పని సెయ్యాల" అన్నాడు.

అందరూ సై అన్నారు. ఆ రాత్రికే భూస్వామ్యశక్తుల మీద తిరుగుబాటు చేయడానికి నిర్ణయించుకున్నారు. ఆడవాళ్ళని, పిల్లల్ని కూడా కలుపుకున్నారు.

"మరి మధ్య తరగతి రైతులో?"

రెండు నిమిషాలసేపు గదంతా మాటలతో గుయ్యిమంది. ఇంతలో కువో కాంగ్ ఎక్కి, "స్, ఆగండి, మద్దె తరగతి రైతులు మనతో కలవాలనుకుంటే కలవొచ్చు. కాని అలని మనం బలవంతెట్టం" అన్నాడు.

ఈ వార్త బైటికి పొక్కిపోతుందేమోనని కువో అందరిని వెంటనే బయల్దేర మన్నాడు. ఇంతలో చు పెద్దగా "షైర్మన్ కువో, ఒక్కసిటం ఆగాల. ఓ ఎదవ మన కూపీ లాగుతున్నాడు. ఆడిని అరెస్టు సెయ్యాలా?" అని అరిచేడు.

"ఆడు సెడ్డోడని, కూపీ లాగుతున్నాడని నీకు నికార్సుగా తెలిస్తే అరెస్టు సేసెయ్యి."

చూ, చాంగ్ చింగ్-షీ కలిసి గుంపుని తోసుకుంటూ ఓ మూల చీకట్లో కూర్చున్న ఓ మనిషిని పట్టుకున్నారు. వాడు చింకిపేలికలు తొడుక్కొని గడ్డి తాడు బెల్టుగా చుట్టుకున్నాడు. ఇతను దుష్టత్రియంలోని 'తు'కి దగ్గర బంధువైన చాంగ్ చంగ్-సాయి అనే భూస్వామి. చూ అతని మెడపట్టుకుని "ఓరి దొంగ నాకొడక! నంజికొడక!" అంటూ వెలుతురులోకి లాగేడు.

ఓ భూస్వామి తమమీద కూపీలాగడం రైతులు భరించలేక పోయేరు. ఇలాంటి సమయంలో రైతుసంఘంలో జొరబడడానికి ఎన్నిగుండెలు! అందరు తోసుకుంటూ, అదుముకుంటూ అతనిచుట్టూ మూగిపోయేరు.

"మామీదే కూపీ నాగుతావురా, మాకే ఎసరెట్టేత్తావా?"

"ఏటి, మల్ల మీదికెక్కిపోదామనే!"

"నిన్నెవుడేటి ఈడకి పంపినాడు?"

"ఈడో భూసోమి!"

"భూసోంవులంతా దొంగనా కొడకలే!"

"ఈడి ఒల్లు సాపుసేసి పంపాల!"

"ఏంవి తెలవనట్టు ముంగిలా ఎలాసూత్తన్నాడో!"

జనంవంతా కోపంతో వుడుకెత్తి పోతున్నారు. సియావో ఎవర్నీ కొట్టొద్దన్న మాట గుర్తున్నా వాళ్ళచేతులు మహాతీటగా వున్నాయి. దీపం వెలుతురులో కాంగ్ మీద నుంచి సియావో కొట్టవద్దన్నట్టు చూస్తున్నాడు. అంచేత రైతులు ఎంత కోపమున్నా చెయ్యెత్తలేరు. అందుచేత కసంతా కేకలేసి తీర్చుకునేందుకు ప్రయత్నిస్తున్నారు.

"ఏ బూసోంవెదవనీ ఒగ్గీకండి!"

"బూసోమ్మెం నశించాల!"

"బూసోమ్మెపు ఇదానాల్ని బద్దలగొట్టండి!"

"ఆల ఆస్తులు సిక్కించుకోండి! ఆల అధికారం లాక్కోండి! పుచ్చుకోండి! గుంజుకోండి ఆల ఆయుధాలు!"

ఆఫీసుగది దక్షిణపు వేపునుంచి, పడమర వేపునుంచి జనం పోటీలమీద నినాదాలిస్తున్నారు. మారుమోగుతున్న ఆ చప్పుడుకి- కిటికీల మీదున్న గూళ్ళలోంచి పిచికలు బెదిరి ఎగిరిపోయేయి. వాటి రెక్కలుతగిలి ఓ పంచుముక్క కిటికీమీదపడి ఫెడేలుమని మోగింది.

"అదేటది, మరో దొంగెదవా?" అని తుళ్ళిపడ్డాడు కువో. అందరూ బైటకు పోయి వెదికేరు. మనిషి జాడేలేదు. నెమ్మదిగా లోపలకొచ్చి మళ్ళీచర్చ కొనసాగించేరు.

"మంచిపనే అయింది. మన జాగ్రత్తలో మనముండాలి" అన్నాడు సియావో.

కూపీ లాగుతున్న చాంగ్ చంగ్-సాయిని బైటికి గెంటేరు.

కువో, చాంగ్ చింగ్-షీ, చూ, ఓల్డ్‌సన్ కలిసి ఆక్టివిస్టుల పేర్లురాసేరు. వాళ్ళని ఇరవై దళాలుగా విభజించేరు. ఆ దళాలు జనాన్ని తీసుకెళ్ళి భూస్వాముల ఆస్తి జప్తుచేస్తారు. లిస్టులురాసి లేచేసరికి తెల్లవారిపోయింది. కోడి మూడోసారి కూసింది. సూర్యకిరణాలు లోపల పడుతున్నాయి.

పాయి భార్య, లీకీ-లాన్ కలిసి మూలపెట్టె లోనుంచి ఓ సిల్కు ఎర్రజెండా పైకితీసేరు. అంతకుముందు సంవత్సరం ఈజెండా అఫీసు గేటుమీద ఎగిరేది. కాని చాంగ్ పూ-యింగ్ వచ్చేక అదితీసేసేరు. ఇప్పుడు మళ్ళా ఆజెండా ఓకర్రకి కట్టి ఉత్తరపు గదిమీద ఎగరేసేరు. పైకప్పు, నేల, మొక్కజొన్న గాదెలు, గడ్డి వాములు- అన్నీ మంచుతో తెల్లగావుంటే దూరానికి జండా మాత్రం వెండికొండ మీద లేచిన మంటలావుంది.

చద్ది అన్నమేనా తినకుండా ఇరవైదళాలు భూస్వాముల ఆస్తిజప్తు చేసుకోవడానికి తలాఒకదిక్కు వెళ్ళిపోయేరు.

సాయుధదళం, తుపాకులు, బల్లేలతో ఊరుకాపలా కాసేపని చూ కి అప్పగించేడు కువో. కువోదళం 'తు' ఆస్తిజప్తు చేయడానికి వెళ్ళేరు. దళసభ్యులు ఇరవైమంది. అందులో ఇద్దరాడవాళ్ళు, ఓ కుర్రాడుకూడా వున్నారు. కుర్రాడు మరెవరోకాదు, పందులకాపరి 'వూ'. చావోభార్య కుట్టిన జోళ్ళతొడుక్కొని ఓ ఇనపచువ్వ పట్టుకుని కువో వెనకనడుస్తున్నాడు. ఆడవాళ్ళలో ఒకరు పాయిభార్య, మరొకావిడ లీకీ-లాన్. తనకి కాబోయే భర్తకు పదేళ్ళు, తనకి పదిహేడేళ్ళు. ఆమె

సన్నగా పొడుగ్గా, కోలముఖంతో ముట్టుకుంటే కందిపోయేలా వుంటుంది. ఆమె లియూయీ-లిన్ అనే పేదరైతు కూతురు. తల్లి చాలాకాలం కిందటే చనిపోయింది. తండ్రి తూ కిటాకీ పడిన దబ్బుకింద కూతుర్ని అమ్మేసేడు- చనిపోయేముందు రోజు. తు పదేళ్ళకొడుక్కి కాబోయే భార్యగా లీని వుంచుకున్నారు. చాంగ్‌ఫూయింగ్ రైతు సంఘంలోవుండి, భూస్వాములను కాపాడుతూ వుండేటప్పుడు దుష్టత్రయంలోని 'తు'కి అతని పూర్తి మద్దతువుండేది. ఆ 'తు'కి లీని వుంచుకున్న 'తు' కుటుంబం చుట్టాలు. అలా వాళ్ళుబలమైన ముఠాగా తయారై తమ ఇష్టం వచ్చినట్టు చలాయించేవారు. లీకీ-లాన్ తన అత్తగారితోపాటు ఉత్తరపుకాంగ్ మీద పండుకుంటే, ఆవిడ కాబోయే భర్త మామగారితో కలిసి దక్షిణపుకాంగ్ మీద పండుకునేవాడు. ఓరాత్రి ఆమెని అత్త నిద్రలేపి మామ ఒళ్ళుపట్టమంది. లీ కస్సుమనిలేచి ఇది తన పని కాదంది. ఆ అత్త అప్పటికి వూరుకుని మర్నాడు లీ గుడ్డ దొంగిలించిందని అల్లరి చేసింది. తనకు దొంగతనం అంటగట్టినందుకు ఆ పిల్ల ఏడుస్తూ మహిళా సంఘానికి ఫిర్యాదుచేసింది. కాని చిన్నమీ అంతావిని లీకీ-లాన్ మామగారు అలాంటి వాడు కాదనీ, యీ కట్టుకథ తాను నమ్మననీ ఆమెని ఇంటికిపంపేసింది.

ఆ రాత్రి జోరునవాన. గదంతా కటిక చీకటి. ఇంతలో ఎవరో కాంగ్ ఎక్కినచప్పుడయింది. వెంటనే లీ మీదకొక మనిషి ఒచ్చిపడి ఆమెను గట్టిగా నొక్కేసేడు. వూపిరాడక బిగ్గరగా అరిచింది. ఆ అరుపుకి ఆమె పిట్ట మొగుడు ఉలిక్కిపడిలేచి పక్కన తన తండ్రి కనపడక ఇంటికి నిప్పంటుకుందో, దొంగలు పడ్డారోనని భయపడి కాంగ్ మీద నుంచి దూకేసేడు. బల్ల దగ్గరకు పరుగెత్తి అగ్గిపుల్ల కోసం వెదుకుతుంటే అతని తల్లి ఓ జెల్లకాయ కొట్టింది. ఆ దెబ్బకి అతనేడుస్తూ దక్షిణపు కాంగ్ మీద పడిపోయేడు. ఈ గొడవలో అతని తండ్రి పట్టు సడలి లీకీ-లాన్ బైటకు ఒక్క పరుగుతీసింది. బయటవాన. మోకాలు లోతు బురదలో నక్కల ఊళలు వింటూ నిల్చుంది. చలిలో భయంతో వణకుతూ "నా నెక్కడకెల్లాల?" అనుకుంది. తలిదండ్రులు, ఇల్లు వాకిలి లేనితనకి దిక్కులేదు. మహిళాసంఘమేనా ఆదుకుంటుందేమోననుకుంటే దానికి చిన్నమీ పెద్ద. ఇంకతను ఎక్కడికి వెళ్ళగలదు? ఓ గాదె మీద తెల్లవార్లూ ఏడుస్తూకూచుంది. వాన హోరులో ఎవరూ ఆమె గోడు వినలేదు.

తెల్లవారగానే లేచి వీధిలోకి పరుగెత్తింది. కొంచెందూరం వెళ్ళగానే రోడ్డు పక్క నీళ్ళు తోడుతూ పాయిభార్య కనిపించింది. లీకీ-లాన్ కాళ్ళకు జోళ్ళులేకుండా

కుంటుకుంటూ వస్తోంది. ఆమె కళ్ళు ఉబ్బి ఎర్రగా వున్నాయి. అది చూసి పాయి భార్య "ఏంవలాగున్నావని" ఆశ్చర్యంగా అడిగింది.

లీకీ-లాన్ మాట్లాడలేక మళ్ళీ ఏడవసాగింది. నీళ్ళు మోస్తూ పాయిభార్య ఆమెని ఇంటికి తీసుకుపోయింది. పొడిబట్టలిచ్చి, కాళ్ళు కడిగి కాంగు మీద పండుకో బెట్టింది. వంటచేస్తూ, లీకీ లాన్ కొచ్చిన బాధఏమిటో తెలుసుకుంది. తన బాధ వెళ్ళబోసుకుంటూ లీకీ ఏడ్చేసింది.

"ఏడవక. నాకాడనే వుండిపో. నిన్నెవరేటిసేత్తారో నానుసూత్తా"నంటూ సముదాయించింది పాయిభార్య.

అప్పటి నుంచి లీకీ-లాన్ అక్కడే ఉండిపోయింది. బైటికి వెళితే అత్తారికి తెలిసిపోతుందని పాయిభార్య ఆవిడకి ఏదో కుట్టుపని అప్పజెప్పి ఇంట్లోనే ఉంచేసేది. ఆని మూణ్ణెలకి తూ కుటుంబానికి లీకీ-లాన్ ఎక్కడుందో తెలిసిపోయింది. కాని పాయిభార్యకి జడిసి యీ విషయం మహిళాసంఘానికి తెలియజేసేరు. చిన్నమీ ఓ మనిషిని పంపి ఆ పిల్లని తీసుకురమ్మంది. కాని పాయిభార్య ఆ మనిషితో "చిన్నమీని ఓ సుట్టు యిటుకాసిరమ్మను, సిన్న మాటున్నాది" అని పంపేసింది.

కాని తన గుట్టు ఎక్కడ బయటపడుతుందోనని చిన్నమీ ఆ దరిదాపులకు కూడా వెళ్ళలేదు. అప్పుడు తు ఇంటివాళ్ళు చాంగ్‌ఫూ-యింగ్‌తో చెప్తే అతను ఆ పిల్ల కోసం సైనికులను పంపుతున్నట్టు చెప్పేడు. ఇది విని పాయిభార్య అగ్గిమీద గుగ్గిల మయింది. రోడ్డుకడ్డంగా నిలబడి, గొంతు చించుకుంటూ,

"మరే, లీకీ-లాన్ నాకాడే వున్నాది. మీకు దమ్ములుంటే రాండి. నాకాడికి రాండి. మీరేటి సేస్తున్నారో నాకు తెల్దనుకున్నారేటి?" అని అరిచింది.

చాంగ్‌ఫూ-యింగ్‌కి కోపమొచ్చి ఆవిడతో దెబ్బలాడాలనుకుంటే లీకీ-యంగ్ గవర్నమెంట్ వర్కర్ భార్యతో తగువొద్దన్నాడు. ఈ తగువు జిల్లా అధికారుల దాకా వెళుతుంది. పాయిభార్యతో గొడవ నిప్పుతో చెలగాటమే.

"ఇంక నువ్వీసంగతి తలవమాక. పాయిభార్య జగడాలమారి అని నీకు తెలీదా?" అన్నాడు లీకీ-యంగ్.

ఆఖరికి తు ఇంటివాళ్ళు తమ చుట్టం-దుష్ట త్రయంలోని 'తు' దగ్గరకు వెళ్ళారు. 'తు' అప్పుడు కళ్ళజోడు తగిలించుకుని 'ఈశాన్య చైనా దినపత్రిక (The Northeast China Daily) చదువుతున్నాడు. అతను ప్రభుత్వవిధానాలు, సైనిక పరిస్థితి

తెలుసుకోవడానికి ఆ పత్రిక ఎక్కువగా చదువుతాడు. చియాంగ్ కై-షేక్ సైన్యం మీద ప్రజావిముక్తి సైన్యం (People's Liberation Army) ఆ శీతాకాలంలో జరిపిన దాడుల గురించి చదువుతున్నాడప్పుడతను. ఆ సమయంలో అతని బంధువులు లీకీ-లాన్‌ని తిరిగితెచ్చుకునే విషయం సంప్రదించడానికి వచ్చేరు.

"అఁహఁ తర్వాత చూద్దాంలే" అనేసి వూరుకున్నాడు.

లీకీ-లాన్ పాయిభార్య దగ్గరే వుండిపోయింది. ఆవిడ పిట్ట మొగుడు, పదేళ్ళవాడు ఎన్నోసార్లు ఏడుస్తూవచ్చి ఆమెని ఇంటికి తిరిగి రమ్మని బతిమాలేడు. అతను పొట్టిగా సన్నగా వుండేవాడు. ఎప్పుడూ నత్తిగా, సంగిరిగా మాట్లాడేవాడు. లీకీ కిందకి వంగి మాట్లాడాల్సి వచ్చేది అతనితో.

లీకీ-లాన్ 'తు' ఇంట్లో కాలుపెట్టినప్పుడే ఆవూరి జనం చప్పరించేరు. "ఇదెక్కడుంటుంది, రేపో మాపో తిరిగొచ్చేస్తాది" అని ఓల్డ్‌సన్ ముందుగానే చెప్పేడు. బలంగా, ఆరోగ్యంగావున్న లీకీ-లాన్ కత్తిపట్టినా కత్తెరపట్టినా చాకచక్యంగా పనిచేసేది. నాట్లు వేయడంలో, నూర్పిళ్ళలో, తిరగలి తిప్పడంలో ఏ మగాడికీ తీసిపోయేదికాదు.

ఏడుస్తున్న 'మగడి'ని చూసి ఆవిడ ఒక్కక్షణం చలించింది. కాని అతని తండ్రి క్రూరత్వంగుర్తొచ్చి రానుపొమ్మని, పాయిభార్యతోనే వుండిపోయింది. సియావో తిరిగొచ్చేక పాయి భార్య, లీకీ-లాన్ కూడా పేదరైతుల కంబార్లలీగ్‌లో చేరేరు. వాళ్ళని కువోదళంలో కలిపేరు. ఇప్పుడా దళం దుష్టత్రయపు 'తు' ఇంటికి వెళుతోంది.

ఓల్డ్‌సన్ కూడా ఆ దళంలో వాడే. జోడు గుర్రాల బగ్గీ మంచులో తోలుకొస్తున్నాడు. కామందు ధాన్యం, కుర్చీలు, బల్లలు ఆ బగ్గీలో రైతుసంఘానికి తోలుకెళ్ళాలని అతని ఉద్దేశ్యం.

వాళ్ళు 'తు' ఇంటికి వెళ్ళేసరికి గేటు గట్టిగా బిగించివుంది. ఓల్డ్‌సన్ గుర్రాలు కట్టేసి గేటుమీద కమ్చీతో కొట్టేడు. లోపల్నుంచి "ఎవరూ!" అంటూ ఆడగొంతు వినిపించింది.

"మీ బంధువు, తలుపుతెరు" అన్నాడు ఓల్డ్‌సన్

"'తు'గాడి ఆడదాయి" అని కువో చెవిలో చెప్పేడు.

ఒకప్పుడు యీ యింట్లో పనిచేయడంవలన లోపల రెండు కుక్కలున్నాయని ఓల్డ్‌సన్‌కి తెలుసు. అందువల్ల గేటు తెరుచుకుంటున్న చప్పుడు కాగానే భయంతో

అందరి వెనక నక్కేడు. తలుపు తెరవగానే ఓ లావుపాటి ఆడమనిషి వెనకనుంచి రెండు కుక్కలు భయంకరంగా మొరుగుతూ ఒకటి కువో మీదికి, మరోటి ఓల్డ్‌సన్ మీదికి దూకేయి. ఓల్డ్‌సన్ బిక్కుబిక్కుమంటూ కుక్కని కమ్చీతో తోలుతూ "నాకాడి కొస్తే సూడుమరి, ఆఁ సూడుమరి....!" అన్నాడు. కాని అదింకా ముందుకొస్తోంది. ఓల్డ్‌సన్ భయంగా వెనక్కిజరిగి, మళ్ళీ పుంజుకుని ముందుకు రెండడుగులు వేసేడు, కుక్క వెనక్కిజరిగింది. ఓల్డ్‌సన్ రాయితీస్తున్నట్టు కిందికి ఒంగేడు. దానితో కుక్క అతన్నివదలి 'వూ' మీదబడింది. ఓల్డుసన్ చెఁవట తుడుచుకుని, సొంతం భయం తీరకుండానే "నాకు తెల్దేటి, నీకునన్ను ముట్టాలంటేనే బయ్యం!" అని గప్పాలు కొట్టేడు.

ఆ కుక్క 'వూ' కాలు కరిచేసింది. కండ బయట పడడంతో జనంరెచ్చిపోయి కుక్కల్ని ఈటెలతో, రాళ్ళతో, ఇనపచువ్వలతో తరిఁమేరు. ఇంటి తలుపులన్నీ మూసి వుండడం వల్ల ఇంట్లోకి వెళ్ళలేక కుక్కలు "కుఁయ్యో" మంటూ ఇంటి ముందు జాగాలోనే తిరుగుతుంటే జనం పట్టుకుని కట్టేసేరు, ఇక ధైర్యంగా ఓల్డుసన్ "ఆముండల్ని సంపండి, ఒగ్గీకండి!" అని అరిచేడు.

కుక్కల్ని తర్వాత చంపుదామని గుర్రాలసాలలో కట్టేసేరు. కోళ్ళన్నిటిని పట్టుకుని గూట్లోకమ్మేసేరు. గుర్రాలు గడ్డిమేస్తున్నాయి. ఇంక ఇంట్లో సందడి లేదు. పాయిభార్య, లీకీ-లాన్ కలిసి ఇంట్లో ఆడవాళ్ళందరిని తూర్పుగదిలో కూర్చొబెట్టేరు వాళ్ళందరు కాంగ్ మీద దర్జాగా కూర్చుని అటుయిటు తిరుగుతున్న జనాన్ని చూస్తున్నారు. జనం వాళ్ళకేసి చూసినపుడు తలలు దించుకుంటున్నారు. గదినిండా జనాన్నిచూసి 'తు' మనఁవడు బావురుమన్నాడు.

"ఏడవకేడవకు. ఏడిస్తే ఏమొస్తుంది, కళ్ళు వాయడంతప్ప?" అని సముదాయించింది తు భార్య, ఆవిడ సన్నగావుంది. కోతిలాగా ఒళ్ళంతా ముడతలుపడింది.

ఇంతలో బైటనుంచి పందులకాపరి 'వూ' "తప్పుకోండి, తప్పుకోండి, కుబేరుడొత్తన్నాడు" (God of Wealth) అని అరిచేడు.

అందరూ అటుకేసి చూసేరు. 'తు' పాత టోపీ పెట్టుకుని, పొడుగాటి అతుకుల అంగీ వేసుకున్నాడు. 'వూ' ఆ అంగీ విప్పగానే సిల్కుకోటు బయట పడింది. 'తు' తల దించుకున్నాడు. అతనిటోపీ అతని దట్టమైన కనుబొమల మీదగా కిందకు జారింది.

"నీ సొమ్ముంతా ఎక్కడ దాచిపెట్టావో, బేగిసెప్పు" అన్నాడు 'వు' ఈటె అటు యిటు తిప్పుతూ.

'తు' తలెత్తేడు. బొద్దుమొహం, చిన్నకళ్ళు, నెరుస్తున్నజుట్టు. దొంగనవ్వు నటిస్తూ "మాదగ్గరఏఁవీ మిగల్లేదు" అన్నాడు.

ఓల్డుసన్ ముందుకొచ్చి "మనూళ్ల, పైప్వార్లల్ల కలిపినీకు రెండువేల ఎకరాలున్నాయి. అటిమీదొచ్చే పలసాయంతోనే బంగారపు బుద్దుడి బొమ్మ పెద్దది కొనొచ్చునే! నువ్వెక్కడ దాసీసినావో మాకు తెల్దని నీకాడ బంగారంఁవే నేదంతా పేటి?" అన్నాడు.

"లేదు, నాదగ్గర ఏఁవీలేదు. ఉంటే ఎప్పుడో ఇచ్చేసేవాణ్ని. ప్రజలకి సాయ పడ్డంఁవే నాఉద్దేశ్యం. అయినా బంగారం దాచుకుని నేనేం చేస్తాను? ఇప్పుడు ఎనిమిదో దళసైన్యానిదే రాజ్యం. ఎవరికీ తెలీకుండా సొమ్ము నేనేం చెయ్యలేనుకదా?" అని దొంగ ఏడుపు ఏడిచేడు. కడుపులో దుఃఖం లేకపోయినా కళ్ళలో నీళ్ళు తిరిగేయి. ఆడవాళ్ళు అతని వంక జాలిగా చూసేరు. ఇక ప్రశ్నలు చాలించి అతన్ని వదిలేయ డానికి సిద్ధపడుతున్న సమయంలో కువో లోపలికొచ్చేడు. ఒక్క చూపుతో అక్కడి పరిస్థితి అతని కర్థమయింది. దొంగవెధవ ఆడవాళ్ళని బోల్తాకొట్టించాడు! వెంటనే కువో కాంగ్ మీదకెక్కి,

"ఆడి మాటలు నమ్మకండి. పెతిభూస్వాఁవి దొంగనాయాలే. జాలిపడతారని ఆడు మొసలి కన్నీరు కారత్తన్నాడు. కాని ఇన్నాలు మనం ఏడ్సిన ఏడుపులో యీడి ఏడుపెంత? మా అయ్య సచ్చిపోయినరోజు యాదస్తున్నాది. అయాల మంచు కురుస్తున్నా జబ్బుతోవున్న మా యయ్యని ఆరో నంబరు హాన్ బైటికి నాగించేడు. అప్పుడు ఈ 'తు' కూడా ఆడనే వున్నాడు. అప్పుడు ఈఁడేటన్నాడు? "బేగి బైటికి నాగీండి. సచ్చే మనిసి లోనుంటే ఇల్లంతా కంపైపోతాది" అనలా? అప్పుడు మా యయ్యని పైకి నాగీసినారు, ఆడనే అయ్యగడ్డ కట్టుకుని సచ్చిపోనాడుకాదా?" అన్నాడు.

కువో మాట్లాడినంతసేపూ లీకీ-లాన్ అతన్నే చూస్తూ, ఆ కథవిని చివరికి కళ్ళు తుడుచుకుంది.

పాయిభార్య "ఆనాడు మమ్మల్ని తొక్కేసినావు, వుప్పుడు నిన్ను కనికరించాలా?" అని కోపంగా అడిగింది.

తీన్ తాత అందుకున్నాడు: "నిజఁవే, కువో తండ్రిని ఆనాడు పైకీడ్సి సంపేసి నారు. గదిలోనే వుంచితే బతికేవోడే. కువో కుటుంబం కోసరం మనఁవీడి మీద పగతీసుకోవాల."

"మా కుటుంబానికే కాదు, బూసోఁవన్నోడు అందరికీ పగోడే. బూసోఁవి ఎక్కడ అడుగెడితే అక్కడ తిరగలి నాగ మనుసులిని నలిబలి సేత్తాడు." అన్నాడు కువో.

తలుపు దగ్గర నుంచి ఓల్డ్‌సన్ అందుకున్నాడు: "పెతీ బూసోఁవి జనానికి పగోడే. 1945లో నాను కొండమీది కప్టెలు ఈఁడింటికి తోలేవోన్ని. పొద్దస్తమానం పనిచేసేవోన్ని. ఓ రాత్రి పొడుకున్నానోనేదో ఈఁడొచ్చి "నెగు నెగురా, దొంగ నాయాల! అప్పుడే నిద్దరేటిరా? గుర్రానికిసీలెట్టు దావంతో సచ్చిపోతన్నాయి?" అని అరిసినాడు."

పాయిభార్య కూడా మాట కలుపుతూ, "నాను పాయి అంటంతే ఇన్నాను–" అంది. ఇప్పుడావిడ భర్తని 'నా యజమాని' అనడం మానేసి అతని పేరుతోనే పిలుస్తోంది. "నాను పాయి అంటంతే ఇన్నా. 'ఈఁ తు గాడు ఆరోనంబరు హాన్ లాగే దేవతలాగా కనబడే దెయ్యం.' పాయి ఓ నాడు యీఁడిని అప్పడిగితే "నేదు. నువ్ సగానికి సగం ఒడ్డీఇస్తే నాబంనేదు. నువ్ రూపాయికి రూపాయి ఇచ్చినా అప్పివ్వను" అని మొగం మీదే చెప్పేసేడు. ఈఁడి రెండో కోడలు పిలిసి 'కప్టెలట్టు కొత్తే రూపాయికి అద్దురూపాయి వొడ్డీకి అప్పిత్తా'నంది. ఒప్పుకోక ఏటిసేత్తాం? అది సలికాలం. ఆ డబ్బుతో దుక్కగుడ్డలు కొనుక్కోవాల. నేకంటే సలికి సవ్వాల."

ఈ కామందుపల్ల తాముపడ్డ బాధలందరికీ గుర్తొచ్చాయి. తు ని కొట్టెయ్యాలన్నంత కోపం అందరికీ ఒచ్చింది.

"బూసోఁవుల ఎదవపనులందరికీ ఎరికే"

"కాఁవందులంతా దొంగనాయాల్లే."

"ఈఁలు సొమ్మంతా ఎక్కడెక్కన్నోదాత్తారని సియావోబాబు సెప్పలా?" ఎవరో ముందుకొచ్చి సరదాకి 'తు' టోపి తీసి తన తలమీదపెట్టుకున్నాడు. 'తు' బట్టతల మీద నుంచి చెమట కారిపోతోంది. అతను చాలా భయపడుతున్నట్లు వుపించేడు.

"జడవమాక. మాఁవ్ నిన్నేఁవీ కొట్టం. కాని నీ సొమ్మెక్కడ దాసేవో సెప్పాల" అన్నాడు కువో.

"బూసోఁవికి మరాదేటి, అన్ని బాదాల్సిందే"నన్నాడో సాయుధదళ సభ్యుడు. అతడు 'తు'ని కొట్టేందుకు చెయ్యిలేపేడు కాని కువో ఆపేడు.

"ఒద్దు కొట్టొద్దు, కొట్టడం కమ్యూనిస్టుపార్టీ యిదానం కాదు"

కువో 'తు'ని తన బంగారం(వంతా ఎక్కడుందో చెప్పమన్నాడు.

సియావో తలుపు దగ్గర నుంచి జరిగేదంతా చూస్తున్నాడు. 'తు' దొంగ ఏడుపు, ఆడవాళ్ళు కరిగిపోవడం, ఇంతలో కువో కల్పించుకుని వాళ్ళ కళ్ళు తెరిపించడం అన్నీ చూసేడు. జనం 'తు'ని కొట్టకుండా కువో చూసుకోవడం కూడా సియావోకి నచ్చింది. ఈ దళం సవ్యంగా పనిచేస్తోందని నిర్ధారణచేసుకున్నాక మిగతా దళాలను చూడ్డానికి వెళ్ళిపోయేడతను.

కువో వాళ్ళని వారించడం చూసి 'తు'కు ధైర్యం వచ్చింది. కువోని ఆకట్టుకో గలిగాననుకుని నక్కవినయాలు పోయేడు :

"ఛైర్మన్ కువో !"

ఓల్డ్‌సన్ అతన్ని టక్కున ఆపి,

"కువో నీ సెయిర్మన్‌కాదు, ఆ బాబు మాలీగు సెయిర్మన్" అన్నాడు. 'తు' మళ్ళీ మొదటికొచ్చేడు :

"లీగ్ ఛైర్మన్ కువోబాబూ ! నువ్వే చూస్తున్నావు కదా, నా ఆస్తంతా యిక్కడే వుంది. నీ తోడు బాబూ, నాకింకే(వీలేదు. ఇంకే(వన్నావుంటే మీకెప్పుడో ఇచ్చేసేవాణ్ని. అదే నా లక్ష్యం కాదా ?"

కువో పైపు కాలుమీద కొట్టుకుని, నవ్వుతూ "నీకు రెండొందలెకరాలున్నాయి కదా, ఏట్నేదంతా వేటి ? ఎవరితోటి నీ పరాసికాలు ?" అనడిగేడు.

"నా ఆస్తిలో కొంతభాగం రెండుదఫాలు ఇచ్చేసేనే" అన్నాడు 'తు' పైకిచూస్తూ.

"ఏటి నువ్విచ్చిన ఆస్తి ? ఓ సుట్టు మూడు తోలు పలుపుతాల్లు, ఓ కుంటి గుర్రమూను. ఇంకేటివ్వనంటే ఇవ్వననీసినావు. మరోసుట్టు ఆ వాంగ్‌పూ-యింగ్ గాడిని ముందెట్టుకోని ఇచ్చినావులే రెండు కుల్లుకంపు దుప్పట్లు ! కుదవబెట్టుకున్నావుగాదా శానా బంగారం, మరొక్కకాసన్నా ఇచ్చినావా ? నీకెంత సొమ్మున్నాదో మాకుపూరా ఎరికే. మాఁవు గుడ్డోల్ల(వేటి ?" అని ఓల్డుసన్ అడ్డు సవాల్ వేసేడు.

"నీ ఆటలు మాకాడకాదు. నిన్ను కొట్టనంత మాత్రాన ఒగ్గిస్తా(వేటి ?" జైల్లెడతాం" అన్నాడు కువో.

ఇది విన్నాక జనం యింకా ధైర్యం పుంజుకున్నారు.

"అయితే యీడిని కట్టేసి రెన్నాల్లు బొక్కలెట్టండి" అన్నాడు ఓల్డుసన్. ఓ సైనికుడు తాడుతెచ్చేడు. 'తు'ని ముందుకుతోసి "ఓరి దొంగనాయాల, నీ సొమ్మంతా ఇత్తావా, బొక్కలోనే కూకుంతావా?" అన్నాడు 'వూ'.

ఉన్న గొడవకితోడు 'తు' భార్య, మనవడు ఏడవసాగేరు.

"మీరేడవకండే! మీరలాఏడిస్తే నాకేం చేయడానికి తోచదు" అన్నాడు 'తు' విసుక్కుంటూ, బొజ్జమీద చేతులుంచుకుని.

"ఇక పిచ్చిమాటలు మాని అసలు సంగతికిరా. నువ్ మాకు చగలం బాకీ పడ్డావు. ఉప్పుడు పీదోడినాగ ఏసాలేత్తావేటి?"

"నువ్ మంచుకో ఆపీసరుగా ఎంతోటి మందినో సంపేవు. మా సేవటంతా సంద్రింవైపోనాది. అప్పుడేటిసెయ్యాలో నీకు బాగాఎరికే. ఉప్పుడేటిసెయ్యాలో తెల్దం నేదేటి?" అన్నాడు సైనికుడు.

"అపీచరుగా వున్నపుడు నాసేత గొడ్డుసాకిరి సేయించినావు. కోడి కూతతో నెగిసి నీ యింటదీపాలెట్టేదాక పనేసేవోన్ని. జాపోసి ఇంటకెల్తే నాయింటికాడ పనుండేది. గడ్డికోసి, గుర్రాలకి మేతెట్టి, నీలుతోడి, పుల్లలేసి, అంటుకుండలు కడుక్కునివోన్ని. ఇంతసేసినా నాకురోగంవొచ్చి గెంజినీలడిగితే గిజగిజ గింజు కున్నావ్. ఉప్పుడు నీపని మా బాగా కుదిరింది" అన్నాడు చంకలెగరేస్తూ ఓల్డుసన్.

"ఈడినిప్పుడే బొక్కనోకి తోసేండి" అన్నాడు 'వూ' అసహనంగా.

"తొయ్యకండి, చెప్తా, చెప్తా" నంటూ తడబడ్డాడు 'తు'. కువో జనాన్ని నిశ్శబ్దంగా వుండమని సైగచేసేడు.

"ఒల్లకుండండి, ఏటి సెప్తాడో ఇందాం" అన్నాడు సైనికుడు

ఇంటాబైటా అంతా నిశ్శబ్దం. కిటికీల్లో పిచికల కిచకిచ తప్ప మరో శబ్దం లేదు. 'తు' గట్టిగా వూపిరి పీల్చుకుని, అటూ యిటూ చూసి దక్షిణపు కాంగ్ వైపు నడిచేడు. జనం తప్పుకున్నారు. కాంగ్‌మీద కూర్చుని మళ్ళీ దొంగ మాటలు మొదలెట్టేడు.

"ఏం చెప్పమంటారు? నిజంగానే నాకేంపీ ఆస్తిలేదు"

జనం కోపంపట్టలేక మీదమీదకు తోసుకొచ్చేరు.

"నెగు, నెగు, నిన్నెవుడు కూకోమన్నాడు?" అని 'తు'ని 'వూ' తోసేడు. మోచేతుల్తో పొడుస్తూ, చేతుల్తో తోస్తూ జనం అతణ్ని తలుపు దగ్గరికి నెట్టేరు.

"నా సెయ్యి గట్టిగా బిగించి బిగించి నెప్పెట్టేసినాది" అన్నాడు ఓల్డుసన్.

"ఇక నాబంలేదు. ఈడి ఈపి మీద కర్రొడితేగాని ఈడి నాలిక ఆడేలాలేదు" అన్నాడు సైనికుడు తుపాకి పూస్తూ

మరోసారి 'తు' తాలూకు అతవాళ్ళంతా మొరోపిస్తున్నారు. మనఁవడు కూడా పుత్రికలిపేడు.

ఈవో వాళ్ళని విసుక్కున్నాడు "ఏటలా రాగాలెట్టేసినారు, అన్ని ఎవులూ ముట్టనైనా ముట్టనేదు!" అని.

"మీరెంతేడ్సినా ఆడు మాఠాకీలన్నీ కక్కాల!" అన్నాడు ఓల్డుసన్.

"ఇదోఎత్తు. ఇందులో మాఁవు పడఁవే!" అన్నాడు సైనికుడు.

'తు' చేతులు జోడించి బతిమాలసాగేడు.

"నా కోసం కాకపోయినా బుద్దుడి కోసఁవైనా దయతలచండి బాబూ"

మూలనున్న ఇత్తడి బుద్ధుడి కేసిచూసేడు. ఆ విగ్రహం రెండడుగుల ఎత్తు వుంది. ముఖం నవ్వుతోంది. చేతులు జోడించి వున్నాయి. మెరిసే కళ్ళతో లోకాన్ని పరికిస్తున్నట్టుంది. చిరునవ్వుతో మెరుస్తున్న బుద్ధుడిని చూసి ఓల్డుసన్ రెచ్చిపోయేడు, అతను 'తు' ఇంట్లో పనిచేసేటప్పుడు చలికాలం ఓరోజు ఓ గుర్రం పిల్లని పెట్టింది. ఆరోజున హోరుగాలి, జోరున మంచు. వెచ్చటి ప్రదేశానికి మార్చేలోపలే గుర్రప్పిల్ల చచ్చిపోయింది. 'తు' ఓల్డుసన్‌ని పిలిచి ఇదే బుద్ధ విగ్రహం ముందు మోకరిల్లమన్నాడు.

"నువ్వో ప్రాణినిచంపి బుద్ధుడికి కోపం తెప్పించేవు. ఇప్పుడేం చేస్తావ్?" అనడిగేడు 'తు'.

"ఏటిసెయ్యఁవంతావ్ బాబూ?"

"నువ్వే చెప్పు"

"అగరొత్తులెలిగిత్తాను, బుద్ధుడి కాల్లమీదపడతా"

"అంతే అయితే అలా మోకాళ్ళమీదే నిల్చో"మన్నాడు 'తు'.

మధ్యాహ్నంవరకు ఓల్డుసన్ అలాగే వున్నాడు. అప్పుడు 'తు' చేతులు వెనక్కి కట్టుకుని, తలకొద్దిగా వంచి, అడుగులో అడుగేసుకుంటూ వచ్చేడు.

"ఇప్పుడేఁవంటావ్?"

అప్పటికే ఓల్డుసన్ మోకాళ్ళు మంట పెడుతున్నాయి.

"నువ్వేటంటే అదేసేస్తాను బాబూ" అంటూ గొణిగేడు ఓల్డుసన్.

"అయితే ఈ కాయితం మీద వేలిముద్ర వెయ్యి"

"ఓల్డుసన్ ఓ గుర్రప్పిల్లను చంపి బుద్ధదేవుడి ఆగ్రహానికి కారణమయేడు కాబట్టి బుద్ధుడికి ఎర్రసిల్కుగుడ్డ కొనడం కోసం అతను మూడునెలల జీతం వదులుకుంటాడు" అని రాసివున్న కాగితం మీద వేలిముద్ర వేసేడు ఓల్డుసన్.

ఇదిగో, మళ్ళీ ఆ బుద్ధుడే! కోపంతో మండిపోతూ ఆ విగ్రహం నెత్తిమీద కర్రతో ఒక్కటి వేసేడు ఓల్డుసన్. ఆ శబ్దం మారుమోగింది. అందరూ అతన్ని అనుసరించేరు. ధగధగా మెరిసిపోతున్న విగ్రహం రూపు మాసిపోయింది.

"బూసోఁవులు, దేవుళ్లు, దయ్యాలు- అందరూ మన్ని మోసం చేసినారు" అన్నాడు ఓల్డుసన్.

అప్పటిదాకా కువో, మరికొందరు ఆక్టివిస్టులు బైటగదిలో చిన్నగా ఏదో మాట్లాడుకుని తిరిగొచ్చేరు.

"ఆగండి, ఇకదాన్నాగ్గండి. 'తు' యింకా ఏం మాటాడనేదు. ఏటి సేద్దాం?" అని అడిగేడు కువో.

"బూసోఁవుల బుర్రలు ఎండు చెక్కలకన్నా, రాతి సిప్పలకన్నా గట్టిగుంటాయి. ఈడి బుర్ర బగ్గిసేయలేరగాని ఈన్ని బొక్కలెట్టీగలం" అంటూ ఓల్డుసన్ కన్ను కొట్టేడు.

"ఈన్ని బొక్కలో తోసేముందు బాగా తగలనివ్వాల" అన్నాడో సైనికుడు.

కువో వంటింట్లోకెళ్ళి పైపు ముట్టించుకొచ్చేడు.

"మనమీన్ని కొట్టలేంగాని ఎంతబాకీ వున్నాడో తేల్సగలం" అని 'వూ'ని 'లెక్కల వైద్యుడి' కోసం కబురంపేడు కువో.

'వూ' ఓ ఈటెతో బైటికితోసుకు వెళుతుంటే "లెక్కలబల్ల కూడా తెమ్మను" అని వెనకనుండి కేకేసేడు కువో.

కొద్దిసేపట్లోనే నల్లగా, సన్నగావున్న వైద్యుడిని తీసుకొచ్చేడు 'వూ'. జనం తప్పుకుని దారిచ్చేరు.

"నీ బంగారఁవెక్కడెట్టేవో బేగిసెప్పుమీ మా బాకీ లెక్కకట్టేక నువ్ వడ్డీ పైసలతోకలిపి పైసాపైసా తిరిగివ్వాల" అన్నాడో ఆక్టివిస్టు.

"నాదగ్గర బంగారమేలేదు"

వైద్యుడు కళ్ళద్దాలు నుదురుమీదకు తోసుకుని, లెక్కలబల్ల 'తు' వేపుచూపిస్తూ గుళ్ళు గలగల్లాడించేడు.

"కవులునెక్క తర్వాత సూద్దాం. ముందు నీకూలీలనెక్క తేలాల నీకాడ సగటున ఏడాదికి ముప్పయిమంది కూలీ లుండీ వోరు. ఒక్కోడు పదెకరాలు సాగుజేసేవోరు. అవునా, కాదా ?" అని అగేడు కువో."

"అద్గదీ, పదెకరాలే" అన్నారు చాలామంది.

"ఓ గుర్రంతోకలిసి" అని సవరించేడు ఓల్డుసన్.

"ఒక్కకూలీ తిండి, కూలి కలిపి రెండెకరాల మీదొచ్చేపంట, ఒక్కోగుర్రానికి రెండెకరాల పంట అయ్యేది" అన్నాడు కువో.

"ఇంకా తక్కువే" అన్నాడు ఓల్డుసన్.

"పోనీ ఎక్కువే లెక్కకట్టి సూద్దాం. గవుర్నమెంటుకి పన్ను, ఇంకా కరుసులు కలిపి రెండెకరాల పంటకిసరి. ఆరెకరాలపంటపోను నీ నాబం నాలుగెకరాల పంట. నల్లమాఁవా, నీబల్లమీన నెక్కసూడు."

ఆ వైద్యుడు నల్లటి నలుపు గనక అతన్ని కువో అలాగే పిల్చేవాడు. 'నల్లమాఁవ' లెక్కచూసి చెప్పేడు.

"రెండెకరాల మీద అయిదుపుట్ల దాన్యం పండుతాది. ఒక్కోకూలీ మీద ఏడాదికి పదిపుట్ల దాన్యం నాబం. ముప్పయిమంది కూలీలమీద ఏడాదికి మూడొందల పుట్ల నాబం."

"ఈడు ముప్పైఏళ్ళుగా బూసోఁవే. నల్లమాఁవా, ఉప్పుడాడు మాకు ఎంతబాకీ వున్నాడో సెప్పుమీ. ఈడికాడ అప్పుతీసుకుంటే నూటికి అరవై ఒడ్డీ తీసుకునీవోడు. అంతపెద్ద ఒడ్డీ అడగంగాని నూటికి ముప్పయి ఒడ్డీ రావాల. అసలు, ఒడ్డీకలిపి ఎంతవుతుందో సెప్పు మాఁవా" అన్నాడు కువో.

వైద్యుడు లెక్కచూస్తుంటే అందరు నిశ్శబ్దంగా నిల్చున్నారు. లెక్కలబల్ల మీద గుళ్ళ చప్పుడు తప్ప మరో అలికిడి లేదు. లెక్కలబల్ల వాడకం తెల్సిన 'తు' తనమీద పడబోయే పిడుగుదెబ్బ పోల్చుకున్నాడు. ముఖం వాలిపోయి, చెఁమట ధారలుకడుతోంది.

"వడ్డీ అలాగుంచితే ఈ ముప్పయి ఏళ్ళకి అడు బాకీవున్న అసలు- తొమ్మిది వేల పుట్ల దాన్యం" అని వైద్యుడు లెక్కతేల్చేడు.

జనంలో ఉత్సాహం ఉరకలు వేసింది. అందరు 'తు' మీదకు తోసుకొచ్చేరు. మళ్ళీ అతని మనఁవడు గోలెట్టేడు. 'తు' భార్య వాడిని వూరడించింది.

జనం మధ్య మూగదయ్యంలా కూచున్నాడు 'తు'.

"సెప్పు, ఏటిసెప్తావో, నోరుగాని పడిపోనాదేటి ?"

"అన్నిసూద్దా, దిట్టిబొమ్మనాగ ఎలాగున్నాదో ?"

"ఒడ్డీ తర్వాత. ముందు తొమ్మిదివేల పుట్లిప్పిచ్చండి. మనకి దాన్యఁవే కొఁరత."

"ఆ కరువు పైసాదాకా తీర్సాల- ఇది బూసోఁవుల రూలేగా ?"

"మంచుకో రోజులు యాదస్తున్నాయా ? ఏడాదంతా నడ్డిఁగేసాగ పన్జేసి సవఁత్సరాదికి ఇంటికిపోతే ఏటున్నాది ? కాంగుమీద సాపనేదు, కుండలో బియ్యఁనేదు. మరి బుగతింటోనో ? ఏటమాఁసం, కోడికూర, బూరెలు- ఓ, ఒకచేటి, ఈది ఈదంతా ఆటి గుమగుఁవేఁ. మన కడుపులు మాడుతుంటే ఆలు దరిజాగా తినీవోరు. నాలుగ్గింజలు అప్పడిగితే తలుపు కొన్నించే గెంటించీవోల్లు. అప్పుడు మన కరివు మంచిదికాదని ఏడ్సుకున్నాఁగాని బుగతే మనకి బాకీ వున్నాడని కాసిలేకపోయాం."

ఎవరి బాధలు వారు వెళ్ళగక్కేరు. అందరూ ఒకసారే మాటాడ్డఁతో రొదగా వుంది. ఆ రొదలోంచి కువో గొంతు ఖంగుమంది

"ఆగండాగఁడి. మనం బూసోఁవి సొమ్మంతా అడుగుతున్నాం. ఇదంతా మన సెఁవటతోటి రకతంతోటి సంపాయిచ్చిందే. ఉప్పుడు మనసొమ్ము మనఁవడుగుతున్నాం. తప్పేటుంది? మన ఇల్లువాకిలి, దాన్యం, ఎండి, బంగారం- అంతా తిరిగి తీసుకుఁదాం.."

"అవును మనసొమ్ము మనంఁవడుగుతున్నాం" అన్నాయి చాలా గొంతులు.

"ఈ ఇల్లు, యింట్లో సరుకులతో మా బాకీ తీపతాదా సల్లమాఁవా ?" అని అడిగేడు కువో.

"ఆఁ, సరిపోతాది."

"ఆడు మాకేఁవీ తిరిగివ్వడు కాబట్టి ఈ ఇల్లు తీసేసుకుందాం. ఆఁ, ఇక యీ యిల్లు మనది. అన్నిసోట్లా బాగా ఎతకండి. ఏదీ ఇరపకండి, ఇది మనిల్లు. మరి బుగతనేటి సేద్దాం ?" అని అడిగేడు కువో.

"ఆరోనంబరు హౌస్ కాడికి పంపీండి"

"ఈడు ఎవుల్నీ సంపనేదే. ఈడు క్రిమినల్ కాదు" అన్నాడు కువో.

"ముందస్తుగా అన్ని ఒసారాళో కట్టిపడెయ్యండి"

సైనికులు 'తు'ని, అతని కుటుంబాన్ని వసారాలోకి తోలేరు. జనం ఇల్లంతా వెతికేరు.

కొందరు వెదుకుతుంటే, కొందరు దొరకినవాటిని లిస్టురాసేరు. మరి కొందరు దొరికినవాటికి సీలువేసేరు. పెట్టెలన్నిటిని స్వాధీనం చేసుకున్నారు. కొందరు పైకప్పుకి వున్న పూల డిజైను కాగితాన్ని ఈటెలతో పొడిచి చూసేరు. కాంగ్ మీది చాపలు దుప్పట్లు తీసి చూసేరు. నేల మీది కాగితాలు, గుడ్డపేలికలు చెల్లా చెదరుగా పడివున్నాయి.

"'తు'ని తీసుకురండి. ఇంకో సుట్టు అడిగిసూద్దాం" అని, పాయిభార్యతో "మీరు, ఆవిడ, 'తు' ఆడోల్లని సొమ్ము ఎక్కడుందో అడగండి" అన్నాడు కువో.

"'ఆవిడ' అంతన్నావ్, ఎవులేటి?" అని ఎకసక్కెమాడింది పాయిభార్య. ఏదో తప్పుచేసినట్టు ముఖం ఎరుపెక్కగా, మారుమాటాడకుండా వెళ్ళిపోయేడు. 'వూ'తో కలిసి ఇంటి మూలల్లో ఇనపసువ్వతో పొడిచి చూడసాగేడు. పాయిభార్య లీకీ-లాన్‌ని వెక్కిరిస్తూ పిల్చింది: "రారా 'ఆవిడా'! ఆడోల్ల సంగతి సూద్దాంరా". లీకీ-లాన్ ముఖం కూడా కందిపోయింది.

జనం మళ్ళీ 'తు'ని చుట్టుముట్టేరు.

"బేగి బంగారం సూపిచ్చు" అన్నాడో సైనికుడు.

"నీ కాడ వున్నదంతా నాను సూసేను. ఆ బంగారం ఇవ్వకుంటే నీకే నస్టం" అన్నాడు ఓల్డుసన్.

"నా పెట్టెలన్నీ చూసేరుగా, ఇంక ఎక్కడుంటుంది?"

ఓల్డుసన్ బాగా దగ్గరికొచ్చి "తలతల మంటాదే, ఆ ఎండి, బంగారం ఎక్కడెట్టేవో సెప్పు; బేగి సెప్పు" అని అడిగేడు.

"నాదగ్గరేఁవి బంగారఁవుంటుంది? ఆ గుడ్డపీలికలు చూడండి. వెండి బంగారాలున్న కొంపలావుందా ఏఁవన్నా? అసలైనా మీకు తెలీకుండా ఎలాదాయగలను?" ఎలాగన్నా తప్పించుకోడానికి తు ప్రయత్నం. కాని ఓల్డుసన్ అతన్ని వదల్లేదు.

"ఏటేటీ? నీకాడ బంగారం నేదంటావా? నీసిన్న కోడలికి బంగారపు దుద్దులు, నీ పెద్దకోడలికి బంగారపు కడియాలు, నీపెల్లానికి బంగారపు పిన్నులు, గడియారాలు, బంగారపు అచ్చులు, రేకులు వున్నాయి. పురవన్నీ సూపకుంటే నీకు కస్టఁవైపోతాది, సూస్కో".

ఇంత కచ్చితంగా లెక్కలు చెపుతుంటే 'తు' తలదించుకున్నాడు. కాని వెంటనే నిలదొక్కుకున్నాడు.

"అవన్నీ ఎప్పుడో అమ్మేశాను. మంచుకో రోజుల్లో అధికధరల వల్ల మేం బాగా దెబ్బతిన్నాం. డబ్బు మంచినీళ్ళలా ఖర్చయిపోయింది."

"అంతా బూటకం. ఈడిని బొక్కలో తొయ్యెండెహె. అందాకా యిలాగే కబుర్లాడతాడు" అన్నాడో సైనికుడు.

కోపంతో వుడుకెత్తుతున్న జనం 'తు'ని తలుపుకేసితోసేరు, పోతూ పోతూ "నామాటినండి, నామాటినండి" అంటూ బతిమాలేడు 'తు'.

"మాఁవు నీ మాటినాలా? ఈఁల్లంతా నీ సంతానఁవనుకున్నావేటి? ఇక నా మాటంటావా, ఇప్పుడు నా ఒయిసు ఏభై పైసిలుకు. నాను నీ మాటెందుకినాల? తాతకే దగ్గులు నేర్పుతావేటి?"

ఓల్డుసన్ మాటలకు జనం గొల్లున నవ్వేరు.

పాయిభార్య, లీకీ-లాన్ కూడా ఆడవాళ్ళచేత ఏఁవీ చెప్పించలేకపోయేరు.

'తు'తో కూడా ఇక లాభంలేదని తెలిసి కువో అతన్ని వెంటపిలుచుకు వెళ్ళేడు. ఏం జరుగుతుందోనని కొందరు వాళ్ళిద్దరి వెనకే వెళ్ళేరు. కువో బుగతచేత పాతపెట్టెలు బైటపెట్టించి, సామానున్న పెట్టెలన్నీ ఒకచోట పెట్టించేడు. 'తు' చెమఁటలు కక్కుతూ, రొప్పుతూ రోజుతూ చెప్పిన పనల్లా చేయసాగేడు.

"బాకీ పడ్డావ్, బంగారఁవివ్వనంటున్నావ్. అందుకే నీసేత పనిసేయిత్తన్నాం. ఇన్నాలు మాఁవు నీకోసం గొడ్డుసాకిరి సేసినాంకదా, ఉప్పుడు పనిసేత్తంటే నీకెలాగున్నాది?" అని అడిగేడు కువో ఇనపచువ్వ వూపుతూ.

కువో మాట్లాడుతూ 'తు'ని పరిశీలనగా చూస్తున్నాడు. బంగారం ఇవ్వనక్కర్లేనంతవరకు ఎంత పనయినా ఆనందంగా చేయగలుగుతున్నాడు 'తు'. కాని వంటింట్లో ఓపీపా ఎత్తమనేసరికి ముఖం అదోలా పెట్టేడు.

"ఆ పీపాలో వంటింటటి చెత్తంతావుంది. కంపు కొడుతుంది. ఆదెందుకులే బాబూ కదపడం?" అన్నాడు 'తు'.

"సెప్పిందిసెయ్యి. బేగిఎత్తు" అన్నాడు కువో కోపంగా.

'తు' ఆపీపా కదపడానికి చాలా శ్రమపడుతున్నట్టు నటించేడు కాని పీపా కదల్లేదు. కువోకి అనుమానమేసింది. ఇద్దరు సైనికుల సాయంతో ఆపీపా ఓ పక్కకి లాగేరు. మొదట పీపా పెట్టినచోట మట్టితో కొత్తగా అలికినట్లుంది. కువో దాన్ని కాలుతో కదిపిచూసేడు గాని అది గట్టిపడిపోయింది. "అక్కడేఁవీలేదులే, వృథా ప్రయాస" అన్నాడు 'తు', నవ్వుతెచ్చిపెట్టుకుంటూ. కాని ఆ గుంటనక్క ముఖం పాలిపోవడం కనిపెట్టేడు కువో. ప్రజలను మోసంచేయడానికి కాకపోతే ఆపదలో నవ్వగలడా?

"నిజంగానే అక్కడేటీ నేదంతావా?" అని నవ్వుతూ అడిగేడు కువో.

"అక్కడేఁవన్నా వుంటే నా కళ్ళు పేలిపోతాయి" గండం గడుస్తుందని ఒట్టు కూడా వేసేడు 'తు'.

ఓ సైనికుడు కర్రతో పీపాలోపల కెలికేడు. లోపల ఏదో ఖంగుమంది. అతను చొక్కా పైకిమడిచి ఆ చెత్తలోంచి ఓ ఇత్తడి డేక్సా తీసేడు. తర్వాత పీపా ఖాళీచేసేరుగాని మరేఁవీ దొరకలేదు.

'తు' ధీమాగా నవ్వేడు: "నేను చెప్తే మీరు నమ్మలేదు, నిజంగానే నా దగ్గరేఁవీ లేదు, ఈ డేక్సా రైతుసంఘానికిచ్చేస్తాను, తీసుకోండి."

కువో ఆలోచిస్తూ ఓ పక్కన నిల్చున్నాడు. ఇందులో ఏదో మోసంవుంది. అటూ యిటూ పచార్లుచేసి మళ్ళీ ఆ చోటికివచ్చి ఇనపకడ్డీతో అటు యిటు కెలికేడు. కాని మట్టి గట్టిగావుంది. పక్కగదిలోంచి ఓ పారతెచ్చి తవ్వుతుంటే మరో నిమిషానికి పారకి ఏదో తగిలి ఖంగుమంది.

"బంగారం దొరికిపోనాది!" అని అరిచేడు ఓల్డ్‌సన్.

అందరూ వంటింట్లో చేరిపోయేరు, 'తు' కుటుంబాన్ని కాపలాకాస్తున్న వాళ్ళు కూడా పని వదిలేసి వచ్చేరు. కువోని జనం చుట్టుముట్టేరు. ఏఁవుంది లోపల? తరతరాలుగా తమని పీడించి కొల్లగొట్టిన ధనఁవా? అణగారిన తమ ఆశల మధ్య ఉబికిన ఓ వెలుగురేఖా? ఇన్నేళ్ళ తమ శ్రమఫలితమా? విజయం తెచ్చిపెట్టిన గుబాళింపా? ఆత్రంగా చూస్తున్న జనం. కువో తవ్వుతున్న మట్టి ముఖాల మీద పడుతున్నా పట్టించుకోలేదు.

అడుగులోతు, మూడడుగుల వెడల్పు తవ్వేక ఓ సైనికుడు రేకుమూత తీసేడు. దాని కింద చెక్కబల్లలున్నాయి. వాటి కింద ఓ నేల మాళిగ. బైటికి చలిగాలి కొట్టింది. 'వూ' అగ్గిపుల్ల వెలిగించేడు గాని అది ఆరిపోయింది. ఒక్కసారి నాలుగైదు వెలిగించి జాగ్రత్తగా ఆ కంత దగ్గర పట్టుకున్నాడు. లోపల పెట్టెలు, సంచులు కుప్పలుగా పడున్నాయి. ఓల్డ్‌సన్ లోపలికి దిగి మరో మనిషిని సాయం పిలిచేడు. అతని గొంతు పెద్దనూతిలోంచి వినిపించినట్టుంది. ఓ సైనికుడు లోపలకి దిగేడు. ఇద్దరూ కలిసి ముప్పై సంచులు, పెట్టెలు బైటికి నెట్టేరు. జనం వాటిని తెరిస్తే లోపల అన్నీ ఖరీదైన బట్టలే! సిల్కుతానులు, ఊలుబట్టలు, ముఖమల్ బట్టలు, రకరకాల జంతుచర్మాలు, వెచ్చనిటోపీలు. ఇంకా నీలంగుడ్డ తానులు కూడా వున్నాయి.

ఓల్డ్‌సన్ మట్టి దులుపుకుంటూ బైటికొచ్చేడు.

"అన్నీ శానా మంచిగుడ్డలే!" అని ఓల్డ్‌సన్ 'తు' వేపు తిరిగి "ఏఁవి బుగతా, ఏటంతవ్? నీ సొమ్ము కొట్టుకుపోనాదా, లావైపోయి ఇక్కడ ఇరుక్కుపోనాదా? 'పెల్లాంరంకు మొగుడుబొంకు' నాగున్నాది నెత్తురు కూడు తిన్నోడివి, నిజం సెప్పవ్‌లే." అన్నాడు.

'తు' ఏఁవీ మాట్లాడలేక ముఖం చేతుల్లో దాచుకుంటూ దక్షిణపు వేపు కాంగు మీద కూలబడిపోయేడు. బైట 'తు' భార్య కర్రిసాయంతో వెర్రిదానిలా అటు యిటు తిరుగుతోంది.

"బాబూ, మాక్కూడా కాస్త వుంచండి" అంటూ బతిమాల సాగింది.

"తొమ్మిదివేల పుట్ల దాన్యం ఇచ్చేసినావంటే నీ పాపిట్టి సొమ్ము ముట్టం. సెప్పు మరి ఏటంటావో !" అన్నాడు ఓల్డ్‌సన్.

"ఓల్డుసన్, ఆవిడతో నీకేటిపని ? ముందు బళ్ళు తోలుకురా, ఇంతసొమ్ముకి ఒక్కటిసాలదు, రెండుతే" అన్నాడు కువో హడావుడిగా.

మిగతా దళాలు కూడా కొల్లగొట్టిన ధనాన్ని, ముత్యాలుగా మారిన తన చెమట చుక్కలను తవ్వి బయటకు తీసేరు. మధ్యాహ్నం నుంచి సాయంత్రం వరకు స్లెడ్జి బళ్ళు* ఆ మంచురోడ్ల మీద హడావుడిగా తిరిగేయి. వాటిమీద సామాను— భోషాణాలు, పెట్టెలు, బస్తాలు, మూటలు, పీపాలు, కూజాలు, జొన్నలబుట్టలు. మంచుతో గడ్డకట్టిన పంది మాంసం— దోపిడిదార్లకు గోరీ కడుతున్న శుభసూచనలు, తమ దోపిడీకి చిహ్నాలైన ఈ సామానంతా బుగతలు అడ్డమైన చోటా దాచేరు— వంటింటి కొట్టాల్లో, కిటికీలకింద, బావుల పక్కన, గుర్రపుసాలల్లో— ఒకటేమిటి, వీలైన చోటల్లా దాచేసేరు. బుగతలందరు పందుల్ని చంపి సంవత్సరాది నాడు బూరెలు వండుకోవడం కోసం వాటిని ముక్కలుచేసి మంచుకింద దాచేరు. వాటిని రెండు మూడు నెలలు హాయిగా తినొచ్చునని వాళ్ళ ఆశ.

ఓల్డుసన్ స్లెడ్జి మీదకూడా చెక్కభోషాణాలూ, గోనెసంచులూ వున్నాయి. వాటిమీద వాళ్ళగూర్రిష్ట చంపిన రెండు కుక్కలు కూడా వున్నాయి. స్లెడ్జిమీద కూర్చో వడానికి ఖాళీలేక ఓల్డుసన్ గుర్రాలపక్కనేనడుస్తూ "హేయ్, హేయ్" అంటూ కమ్చీరు ఝళిపిస్తున్నాడు.

"ఇదెవరిసొమ్ముతాతా ?" దారిలో ఎవరో అడిగేరు.

"ఇది కొట్టుకుపోయిన సొమ్ము" ఓల్డుసన్ 'తు' మాటలని వెటకారంగా తిరగేసి చెప్పేడు. పలకరించిన మనిషికి ఈమాటలు అర్థంకాలేదు. కాని ఓల్డుసన్ విడమర్చి చెప్పడానికే మరో మాట చెప్పేడు :

"బుగతల సెర్మంసీరితే రత్తం సిమ్మదు, మాయలురాలి ఒడతాయి. కానీ
'బుగతసేసిన మాయ
తిరును ఆడి పీక కోయ'

ఇయ్యాల సైర్మన్ కువో, ఓల్డుసన్ తెలివి సూపకపోతే బుగతలకాడ మట్టి బెడ్డయినా దొరక్కపోను. ఉప్పుడు ఇప్లవానిదే పైసెయ్యికదా, జనానికి నా సత్తా సూపించాల. హోయ్, హోయ్ !" అంటూ గుర్రాన్ని కమ్చీతో అదిలించేడు.

(ఇంకా వున్నది)

* స్లెడ్జి బళ్ళు :— మంచులోనడిపే బళ్ళు

# చిన్నాలు నేడు లేడా?
# చూడు జనంలో వున్నాడు!

అతడు చాచా నెహ్రూకాదు, లోక్‌నాయక్ జయప్రకాషూ కాదు. పదిహే డేండ్లు పాలించి కూతురుకు అధికారం, ప్రజలకు ఆకలీ అప్పులూ మిగిలించిన గాంధీ వారసుడు కాదు. 'పార్టీరహిత ప్రజాస్వామ్యం' నుండి కప్పల తక్కెడ 'జనతా స్వామ్యం' దాకా ఆశీర్వదించి సంపూర్ణ విప్లవం పేరుతో యువతరంలోని విప్లవ చేవను తప్పుదారి పట్టించిన 'మహాత్ముని' వారసుడూ కాదు.

అయితే అంటరాని వాళ్ళు, కాకపోతే హరిజనులు— వుంటే ఊరికి దూరంగా విసిరేసిన మురికి వాడల్లోనో లేదా గాంధీ ఆశ్రమంలోనో, వేలిడిచిన ప్రభుత్వ కాలనీ ల్లోనో తప్ప మనుషులుగా— మన మధ్యన మసలుకునే మన లాంటి మనుషులుగా వాళ్ళకెన్నడూ గుర్తింపులేదు. అన్ని పార్లమెంటరీ పార్టీలకూ వాళ్ళు మనుషులుకాదు ఓటర్లు, మనసులు కాదు నెంబర్లు— నిజమైన సమస్యలు కాదు ఎన్నికల నినాదాలు.

అటువంటి అట్టడుగు మట్టి మనుషుల్లో పుట్టిండు అతడు. కష్టంచేసే వాళ్ళ మొహన పేడచల్లి, కాళ్ళేయి కదపని పెద్దవాళ్ళు మేడలుకట్టిన పైడిపెల్లిలో పుట్టినా పిడికెడు మెతుకులకోసం మెస్‌బాయ్‌గా మెడికల్ కాలేజిలో చేరిండు.

అబ్బిన చదువుకన్న అర్థంచేసుకున్న ప్రపంచం పెద్దది. పుస్తకాలు చదివి చెప్పిన విప్లవ విద్యార్థులతోసహా వైద్య విద్యార్థు లందరిమీదా కష్టజీవులయెడ వారి ప్రవర్తన విషయంలో హెడ్‌క్వార్టర్స్‌ను బంబార్డ్ చేయడం నేర్చుకున్నడు—

దొరలు, భూస్వాములు, పెత్తందార్లు, లోఫర్లు, పోలీసుఆఫీసర్లు, మార్క్సిస్టుపార్టీ నాయకులు అతణ్ణి గూండా అని ప్రచారం చేసిన్రు. కొట్టిన్రు. గొడ్డళ్ళతో నరికిన్రు.

పేదవర్గాల ప్రజలు అతణ్ణి ఎంతగా ప్రేమించిన్రో అక్టోబర్ 19 మధ్యాహ్నం నుంచి 20 మధ్యాహ్నం వరకు ఆయన మృతదేహాన్ని దర్శించదానికి వచ్చి విలపించిన వేలకొలది వేదనాభరిత, ఉద్విగ్న పూరిత హృదయాలే సాక్ష్యం. యువతరం ఆయన నుంచి పొందిన ఉత్తేజానికి ఊరూరూ కన్నీరు మున్నీరుకావడమే కాదు, కదలిపోవడమేకాదు, ఆయన నడిచిన బాటలో మునుముందుకు కదలడానికి ప్రతిజ్ఞ చేయడమే ప్రమాణం— వరంగల్ జిల్లాలో దళితవర్గాల, యువజనుల హృద యాలలో ఇంతగా గూడుకట్టుకున్న మరొక నాయకుడు లేడు. కారణం, ఆయన నాయకుడుకాదు. ఆయన పెద్దవాళ్ళకు కన్నకొడుకు. అక్కలకూ, అన్నలకూ ఎదిగిన తమ్ముడు. చిన్నవాళ్ళకు అన్న.

ఆయనను చంపింది రాజకీయంకాదు ఈర్ష్య. ఆయనను చంపింది హేతువుకాదు కక్ష. పిరికితనానికి ఊపిరిమెసలక ఉద్యమజీవిని హత్య చేసింది. దారి దోపిడీ స్వభావం ప్రజల మనిషి ప్రాణాలను హరించింది. హంతక రహస్య మన స్తత్వం ప్రజాపంథాపై నరబలి కావించి సవాల్ చేసింది.

కాని ప్రజల బాటపై చిందిన ఆ నెత్తురు మధ్యాహ్న సూర్యుని వెలుగులో ప్రజా వీరునికీ, కుట్రదారుల దొంగచాటు రహస్య క్రౌర్యానికీ వున్న తేడాను నెత్తుటి నిజంలా కళ్ళకు కట్టింది.

హత్యలతో విప్లవాన్ని ఆపలేరనీ, హత్యలతో విప్లవాన్ని సాధించనూ లేరనీ గాటుబడిన ఆ యువకుని కంఠం కోట్లాది ప్రజల గుండెల్లో నినదిస్తున్నది.

ఆ యువకుడే జన్ను చిన్నాలు. ప్రజలకు చిరపరిచితుడైన 'రాజు.' విప్లవ పథంలో ప్రజలకోసం ప్రాణాలు బలియిచ్చిన వీరుడు. అతనికివే మా విప్లవజోహార్లు.

6-11-79

— 'సాహితీ మిత్రులు'

## చిన్నాలు ఒరవడి ...

మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ వరంగల్లు జిల్లా నాయకుడు కామ్రేడ్ జన్ను చిన్నాలును హత్య చేశారు. యువజనులు, ఆయన మరణానికి వరంగల్లు విరసం, ప్రగతిశీల ప్రజాస్వామిక రాడికల్ విద్యార్థులు బాధపడుతున్నారు. ఆయన్ను హత్య చేసిన దుష్టశక్తులను వాళ్ళ రాజకీయాలను తీవ్రంగా మేము అసహ్యించుకొంటున్నాము. చిన్నాలు నిరుపేద హరిజన కూలీగా పుట్టి ఐటిఐ చదువుతూ మానేసి విప్లవ రాజకీయాల్లో పనిచేసి విద్యావిజ్ఞానాలు పొంది తన ప్రాంత పేదప్రజల ప్రేమాదరణలు పొంది పార్టీ నాయకుడయ్యాడు. పునాది వర్గాల కార్యకర్తలు పార్టీల నాయకులయ్యే ఒరవడి పెట్టాడు. ఆయన లేకపోవడం వరంగల్లు జిల్లా విప్లవోద్యమానికి చాలా లోటు. అందుకే మేం విచారిస్తున్నాం.

చిన్నాలు హత్య వెనుకఉన్న దృశ్య, అదృశ్య హస్తాలను బయటకులాగాలని ప్రజలకు మేం విజ్ఞప్తి చేస్తున్నాం. పేదప్రజలు, విద్యార్థులు కొద్ది కదలిక చూపితేనే ఎంతో అట్టహాసం చేసే పోలీసులు, ప్రభుత్వం చిన్నాలువంటి ప్రజానాయకుడు పట్ట పగలే హత్య చేయబడితే ఏమీ పట్టనట్టు ఊరకుండటం అతిగర్హనీయం. హంతకులను పట్టుకోవటంలో పోలీసు తమ కనీస డ్యూటీ నిర్వహించాలని మేం డిమాండ్ చేస్తున్నాం.

— విప్లవ రచయితల సంఘం, ప్రగతిశీల విద్యార్థి సంఘం,
రాడికల్ విద్యార్థి సంఘం, రాడికల్ యువజన సంఘం, వరంగల్

ఎవరు ఎందుకు చేసినా పరమదారుణమైనపని. కామ్రేడ్ జన్ను చిన్నాలు హత్యను విరసం ఖండిస్తున్నది— — కె.వి. రమణారెడ్డి, ప్రధానకార్యదర్శి, విరసం.

## పైడిపల్లికి నడుద్దాం....

మేం
పుట్టినపుడు గతించిన గతం
ఒక్కటే మా ఆస్తి

పెరిగి
భవిష్యత్‌లోకి తొంగిచూస్తే
మరణమే మా వాస్తవం

చీకటి దారుల్లో
చంపబడుతున్నవాళ్ళం
మేం

చావు ఛాయల్లో
జీవితాన్ని వెతుక్కోడం
మా పోరాటం....

— ఫైజ్ అహ్మద్ ఫైజ్

చిన్నప్పుడు పుట్టిపెరిగిన మాదిగ కుటుంబానికీ ఎదిగి ఎదిరిస్తూ నేర్చిన మార్క్సిస్టు - లెనినిస్టు నాయకునికీ మధ్య రెండు జీవితాల మధ్య అంతరమేకాదు రెండు ప్రపంచాల మధ్య అగాధం ఉంది. ఈ అగాధాన్ని దాటుకరావడంలోనే రాజు విజయం; నక్సల్బరీ విజయం.

వరంగల్ నుండి ఈ బాటలు, పేటలు, పొలాలు, గట్లు దాటుకొని పైడిపల్లి చేరుకుంటే అక్కడ కూౄరమైన మరణం ఎదుర్కోడం గతితర్కం. మరణం వెలుగులో బతకడం నేర్చుకోవాలి.

రాజు జీవించినంతకాలం మనం పైడిపల్లికి నడుద్దాం ;
జన్ను చిన్నాలుకి విప్లవ జోహార్లు

న్యూఢిల్లీ — సురా

## సామాజిక శక్తికి సమాధి ! ?

ఎ. ఎస్.

రాలినచుక్క :

వెలుగు కోసం
రాలిపోయిన చుక్కను.
నా కోసం
ఎవరు చొచ్చొచ్చొలు కొట్టకండి
ఏడ్వకండి, విచారించకండి
నేను ఉత్తుత్తగేం రాలిపోవటంలేదు.

చేవ ఉంటే గింటే
మీరూ నాతోరండి
రేపటి కోసం వెలగడానికి
మనం వృధాగా చావడంలేదు :
పోరాటం కోసం, సమాజం
వెలుతురు చిమ్ముకుంటూకోసం
రాలుతున్నాం

ఒక కవితాత్మ :

వీళ్ళందరిని ఏడ్వనివ్వండి తనివితీరా
కడుపులో కతలన్నీ కదిలేలాగా—
వెతలన్నీ మెదిలేలాగా—
పిడికిళ్ళు బిగిసేదాకా....
కన్నీళ్ళు కారిపోనివ్వండి.

ఒక గొంతు :

నిన్ను చంపినవాళ్లు—
నిదురెట్లా పోయేరు :
భయంతోబిగుసుకొని
వాళ్లు చస్తారు
నాకడుపులో గడ్డకడుతున్న కసినిచూసి
వణికిపోతారు వాళ్ళు
ఆరంభ సూచకంగా నే నేమన్నా
చేస్తానేమోనని—
బెదురు కళ్ళతో చూస్తారు వాళ్ళు

పుడమితల్లి :

తొలిసూరు కొడుకువనుకున్న —
కాదుర రాజన్న
ముందుగాటిముద్ద బెట్టి సాదుకున్న
గాదురకొడుకా
ఎవర్ని బిలిసి అన్నం బెద్దురా
కొడుకా
సిన్నసిన్న తమ్ములకు బుద్దులు
గ్యానం జెప్పితివి గాదుర కొడుకా
నిను నిలువుత పానం దీసిరిగద
కొడుకా
వాళ్ళ గుండాల రాజ్జెం గుండ్లల్ల
పోనుగద కొడుకా

ఊరేగింపు :

రక్తానిక రక్తంచిందిస్తాం
తోవలో ముళ్ళను ఏరేస్తాం.
జన్ను చిన్నాలు అమర్ హై
అమర వీరుల ఆశయాన్ని తుదికంటా
కొనసాగిస్తాం
పోరాదే వాడిదే ఎర్రి జెండా
సక్సలైట్లే దేశభక్తులు—

[చిన్నాలు భౌతిక క్రియలకు హాజరైన సందర్భంగా పై చిత్రం కన్పించింది. ఒక దిక్కు జనం గోలుగోలున ఏడుస్తూ ఈ వ్యవస్థమీద తమకసిని వెలిగక్కుతున్నారు. మరో దిక్కు పార్టీ దృఢ నిశ్చయంతో ఆయన కార్యాన్ని పూర్తి చేస్తామంటున్నది— చిన్నాలు భౌతికంగా మరణించినా పార్టీ ఉద్యమం ద్వారా అయన మరణించలేదు. అయన కార్యం పూర్తవుతుంది.. అందుకే అక్కడి వాతావరణాన్ని రికార్డు చేశాను—]

బద్‌లా .....
పథిక్

వేదన
గొంతులో అడ్డుపడుతూ వుండే
నీ గురించేమీ
పలకలేను.
కాని—
నీ కోసం రాయాల్సింది
ఎలిజీ కాదు ;
నువు నడిచిన
ప్రజలబాట కాపాడుకునే
ప్రతిక్రియ.

## 'చిన్నాలును నేను చూడనేలేదు' — స్మృతి

అన్నా —
ఎన్నోసార్లు నిన్ను చూడాలనుకున్నా
చూడనే లేదు.
నేనింకా కళ్లు పూర్తిగా విప్పనేలేదు.
అప్పుడే —
నువు మా కళ్ల వెలుగు వౌతున్నావని
వాళ్ల గుండెల నిదిరించే
రుద్రుడి వౌతున్నావని
కసిబూనిన కసాయీలు
నిన్ను కత్తుల కెర జేశారు.

ఐనా —
నిన్ను చూడకున్నా —
నీ హత్య వార్తపిని
క్రోధారుణమైన జనం కళ్లల్లో
నిన్ను చూస్తున్నా
నువు నెత్తుర్లు పోసి
మలిచిన దారిలో
నడుస్తానని బాసచేస్తున్నా.

## అన్నా చిన్నాలు ఇంకేడికెల్లిపోలేదు.

వీరయ్య

అమ్మా : చిన్నన్న యింక మళ్ళీ
రాకపాయెనే ఏడికెళ్ళిపోయెనె

బిడ్డా : చిన్నాలు ఇంక
మనకులేడు నాయినో
మళ్ళీ సూడలేమురో

తలుసుకుంటె నాయినో
దుఃఖ మాగబోదురో
కండ కావరమెక్కినోళ్ళు
కసాయిలురా గుండాగాళ్ళు
ఒక్కన్ని సూసినారు
పక్కపోటు పొడిసినారు ॥బిడ్డా॥

వరంగల్లు వాడల్లో
కూలిగుండె జాడల్లో
కన్నీళ్ళను సూసినోడు
కష్టాలు తెలిసినోడు
తను నమ్మిన ఆశయాన్ని
విడువనట్టి మొనగాడు ॥బిడ్డా॥

సప్లయి బాయిగ ఉండి
సానసాన తెలుసుకోని
మెస్ బాయిగా ఉండి
మెలమెల్లగా కదిలిండు

ఐ.టి.ఐ. సదువుతూనె
ఆలోచించాడతడు
కష్టపడె కూలికొడుకు
కడుపెందుకు నిండదని ॥బిడ్డా॥

రాడికల్ సంఘమాని
రేయి పగలు తిరిగి తిరిగి
రైతుకూలి సంఘమాని
రోజు రోజు కలిసిండు
దున్నేటోడె పట్టెదారు
తినేటందుకక్కుడాను
ఈ పందికొక్కుల తరుమ
జండలెత్తి నడవమనే ॥బిడ్డా॥

ఎమర్జెన్సీ చీకట్లో
ఎన్నో బాధలు పెట్టినారు
కాళ్ళసేత తన్ని గుద్ది
కీలుకీలు ఇరిసినారు
సంఘం మాటెత్తేదుంటె
సంపేసారె తమనిరి
లేనిపోని కేసుబెట్టి
రాత్రి పగలు గోసబెట్టె
ఈ కసాయి సర్కారు
విషపుపాము సుమ్మిరో ॥బిడ్డా॥

శ్రీకాకుళ పోరుబాట
కళ్ళల్లో కదులంగా
ప్రియమైన చారుమాట
మదిలోన మెదులంగా
గిరాయిపల్లి వీరులను
గుండెల్లో దాచుకొన్న
ఎర్రసైనికుడతడు
ఏడికెళ్ళిపోలేదు-
అన్నాచిన్నాలు మనల ఇడిసి ఎల్లిపోలేదు
ఇక్కడానె ఉన్నాడు-
ఒక వీరుడు మరణిస్తే
పుడతారు వేలకొలది
కొండల్లో- కోనల్లో
సేలల్లో- సెలకల్లో
మొలకలయి మొలుస్తారు
పూవులై - పూస్తారు
కంటినీరు తుడుచుకొని
గుండె రాయిచేసుకొని
ఆ వీరుని ఆశయాన్ని
కడదాక విడువమని
నెత్తుటి బాకిని మరువక
పిడికిలెత్తి బాసచెయ్యి
అన్నాచిన్నాలు ఇంకేడికెల్లిపోలేదు
ఇక్కడానె ఉన్నాడు
మన గుండెల్లోన ఉన్నాడు
ఏ గూడెంలోన ఉన్నాడు

(అమ్మా సారంగధార ఎందుపోయె నాయనా ఎక్కడాడుతున్నాడో- అనే పాట బాణీ)

## STOP PRESS

# మార్క్సిస్టు లెనినిస్టు కార్యకర్త కామ్రేడ్ పాలడుగు కృష్ణపై మార్క్సిస్టుపార్టీ దాడి, హత్య

వరంగల్ జిల్లా నర్సంపేట తాలూకా కొత్తగూడెం గ్రామంలో 7వ తేదీ బుధవారం రాత్రి 50 మంది మార్క్సిస్టుపార్టీ కార్యకర్తలు గొడ్డళ్ళు, కర్రలతో మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ కార్యకర్త కామ్రేడ్ పాలడుగు కృష్ణ నిద్రిస్తున్న ఇంటిపై దాడిచేసి, అతణ్ణి నిద్రలేపి, గొడ్డళ్ళతో నరికి, కర్రలతో బాది చంపివేసినారు. ఇంటి తలుపులు పగలగొట్టి ఇంటి యజమాని గౌరయ్యను కూడ తీవ్రంగాకొట్టినారు. ఆయనను వరంగల్ ఎంజిఎం ఆసుపత్రిలో చేర్చినారు. ఆయన పరిస్థితి ఇప్పటికీ తీవ్రంగానేవున్నది.

ఈ దాడిలో మార్క్సిస్టుపార్టీ వాళ్ళు నక్సలైట్లను విచక్షణారహితంగా కొట్టారని యు.ఎన్.ఐ. వార్తా సంస్థ పేర్కొన్నది.

సిపిఎం వర్గస్వభావం మనకు పరిచయమే అయినా ప్రత్యేకించి ఆంధ్రలో.... (కొంతవరకు పంజాబులో) వాళ్ళు రెచ్చగొడుతున్న హిస్టీరియా ఎటు దారితీస్తుందో.... ఇవ్వాళ సిపిఎం రూపంలో ఈ వ్యవస్థ తన్ను తాను రక్షించుకుంటోందంటే ఆశ్చర్యపడవలసిందేమీలేదు.

మార్క్సిస్టు-లెనినిస్టు కార్యకర్త కామ్రేడ్ పాలడుగు కృష్ణకు మా విప్లవ జోహార్లు.

వరంగల్, 10-11-79

— 'సాహితీ మిత్రులు'

# AN APPEAL
## from the friends of Frontier

In course of more than eleven years of its struggling life *Frontier* has tried to hold up the hopes and aspirations of the people during the tumultuous years of the last decade. In each phase of the struggle between progress and reaction it was tried to provide a forum for undaunted expression of progressive thought. It has also tried in its humble way to firmly uphold people's interests. Never once has it drifted into journalistic opportunism. Neither economic hardship nor repeated harassment has been able to push it off its course. This tenacity *Frontier* owes in no small measure to the inspiring support of its readers.

For some time *Frontier* has been operating under severe economic strain. Only the refusal to be beaten has enabled the editor and his assistants to carry on. But continuous strain inevitably tells and sympathetic readers must have noticed the marks of weariness.

We, friends of *Frontier*, are anxious to reorganise the paper, so as to maintain and further improve its standard. All this would need additional funds. We are therefore requesting all friends of *Frontier* to help it with donations, long-term subscriptions or advertisements. Overseas friends can help by long-term subscriptions and paid notices.

P. Varavara Rao, Y. Kasipati, Cherabanda Raju, T. Madhusudana Rao, K. V. Ramana Reddy, A. K. Bagchi, N. K. Chandra, Sumanta Banerjee, Benoy Ghose, Ashok Rudra, Krishna Bharadwaj, Arun Sinha, Shashi Bhusan.

SṚJANA Telugu Monthly Nov. '79 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67



నెత్తురు కారుతున్న మట్టి పాదాల కదలిక నువ్వు
నీ పేరు రైతు కూలి సంఘం
నిన్నెట్లా చంపగలరు వాళ్ళు?

— రాజయ్య

SṚJANA Rs. 1-50
Hanumakonda, Warangal 506001